


# SHELL



**X-100 motor oil**




సంపుటి 2. సంచిక 11.
శుక్రవారం, అక్టోబరు 14, 1949

# సాక్షాత్కారం




"మీరు శ్రీరాముణ్ణి ప్రార్థించి, హనుమంతుని అడుగుజాడల్లో నడుస్తారు కాదూ!-" ఢిల్లీలో జరిగిన దసరా ఉత్సవాల సందర్భంలో రాజాజీ.

తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-11

అక్టోబరు 14, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# వర్కింగ్ కమిటీ నిర్ణయాలు

ఇటీవల కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేసిన రెండు తీర్మానాలు అత్యంత ప్రముఖమైనవి. ఆ తీర్మానాల ఫలితంగా కలుగబోయే పరిణామాలపైనే కాంగ్రెస్ భవితవ్య స్వరూపమే ఆధారపడి ఉంటుందనడం అతిశయోక్తి కాదు. మొదటిది-రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సభ్యులు కోరితే కాంగ్రెస్‌లో చేరడానికి అభ్యంతరం తీసివేయడం. ఈ స్వయంసేవక సంఘం వారు ఈ మధ్య ప్రకటించిన పార్టీ ప్రణాళిక ప్రకారం, వారు రాజకీయాలతో సంబంధం పెట్టుకోదలచుకోలేదు: కాబట్టి, అందులో సభ్యులు ఎవరైనా ప్రత్యేక రాజకీయ వర్గంతో సంబంధం పెట్టుకోదలుచుకుంటే, వాళ్ల ప్రణాళిక అడ్డుతగలదు. ఈ ప్రకటన పురస్కరించుకుని, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ పైన సూచించిన విధంగా తీర్మానించింది. తుదకు తేలిన సారాంశం యిది: "మాకు కాంగ్రెస్‌తో చేతులు కలపడానికి అభ్యంతరం లేదు" అన్నది స్వయం సేవక సంఘం; "మిమ్మల్ని చేర్చుకుందికి మాకు అంతకంటె అభ్యంతరం లేదు" అన్నది కాంగ్రెస్. ఉభయతారకమైన ఏర్పాటు.

ఇక్కడ గమనార్హమైన విషయం ఏమంటే, ప్రత్యేకించి స్వయం సేవక సంఘం కాంగ్రెస్‌లో చేరడానికి తనకు తానై అనుమతి అర్థించలేదు. అయినప్పటికీ కాంగ్రెస్ తనే పురస్కరించుకుని పై తీర్మానం చేసింది. స్వయం సేవకుల ప్రణాళిక ప్రకారం, వాళ్లు తదితర రాజకీయ వర్గాలతో సంబంధం పెట్టుకోవడానికి అంతు లేకపోవచ్చు; కాని, వీరికి స్వాగతమిచ్చే పార్టీలు నేడు దేశంలో కాంగ్రెస్‌ను మినహాయిస్తే యింకేవీ లేవు. కాబట్టి ప్రణాళికలో మార్పు చేసినంత మేరకు స్వయం సేవక సంఘం ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా కాంగ్రెస్‌ను అర్థించిందని అనుకోవచ్చు.

అయితే, యిప్పుడు ప్రశ్న—కాంగ్రెస్ చర్య ఎంతవరకు ఉచితమని. రాష్ట్రీయ స్వయం సేవక సంఘం వారి ఆశయాలేమిటి? ఆ పార్టీపై ప్రచారంలో ఉన్న రకరకాల సంశయాలు అటుంచి, వారి ప్రకటనల ప్రకారమే చూద్దాం: నిర్వచనరీత్యా వారు హైందవ సంస్కృతిని పరిరక్షించడం కోసం పాటు పడతారు. హిందూమతంలోని ఉత్కృష్టతను

కాపాడడానికీ, అందులోని సంప్రదాయాలను గౌరవించడానికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘం కృషి చేస్తుందని శ్రీ గోల్వాల్కర్ అనేకచోట్ల ఉద్ఘాటించారు. అయితే, హిందూ సంస్కృతియొక్క స్వరూపం ఏమిటో, అందులో ఏ భాగాన్ని కాపాడడానికి నడుం కట్టాడో ఆయన ఎక్కడా వివరించలేదు. పత్రికా ప్రతినిధులు వేసిన సూటైన ప్రశ్నలకు యుక్తి యుక్తంగా సమాధానం చెప్పి తప్పించుకునేవారు. కాంగ్రెస్ (కనీసం ప్రణాళిక ప్రకారం) కుల, మత, వర్గవిభేదాలను పాటించని జాతీయసంస్థ. స్వయంసేవకుల హిందూ సంస్కృతి యిందు కంగీకరిస్తుందా? లేక కాంగ్రెస్ భవిష్యత్తులో కుల మత విభేదాలను పాటిస్తుందా? హిందూసమాజ సంప్రదాయంలో (ప్రాచీన గ్రంథాల సూక్తులటుంచి) విడాకులు లేవు. కాని, కాంగ్రెస్ ప్రభుత్వాలు విడాకుల చట్టాన్ని అమలులోకి తీసుకు వస్తున్నాయి. ఇది ఆర్. యస్. యస్. వారి దృష్టిలో హిందూ సంస్కృతికి ద్రోహం కల్గించడమా? లేక దానిని ప్రతిఘటించడమా? పరస్పరం విరుద్ధమైన ఆశయాలు ఎన్నో యిటువంటివి రెండు సంస్థలవారి మధ్యా ఉన్నాయి. ఒకేవ్యక్తి ఒకే సమయాన అటు కాంగ్రెస్ ఆశయాలనూ, యిటు ఆర్.యస్.యస్. ఆశయాలనూ ఏవిధంగా అమలులో పెట్టగలడు? ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పవలసిన బాధ్యత కాంగ్రెస్ పెద్దలపై ఉన్నది. “సంస్కృతి” అనేది చిత్రమైన పదం. దానిని స్వప్రయోజన పరులు ఎలా వాడినా లొంగుతుంది. కాని, మత విషయకమైన సంస్కృతి వేరు; ఆధునిక యుగంలో వికాసం చెందవలసిన సమాజ సంస్కృతి వేరు. కాలగమనంలో ముందుకి వెళ్ళడమే కాని, వెనక్కి మళ్ళడం అసంభవం అన్న పండిత నెహ్రూ విశ్వాసం, ఆయనతో చేతులుకలిపి పని చేసేవారి కున్నట్లు గోచరించదు.

ఇక కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేసిన రెండవ నిర్ణయం రాష్ట్రీయ శాసనసభల్లో కాంగ్రెస్‌పార్టీ నాయకత్వానికి కాలపరిమితి నిర్ణయం. ఇంతవరకూ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీనాయకత్వానికి ప్రతిసంవత్సరం ఎన్నికలు జరుగుతూ ఉండేవి. అవి ఏరీతిగా జరిగేవో, వాటివల్ల రాష్ట్రంలోని ప్రజలు ఏవిధంగా బాధపడుతున్నారో, ముఖ్యంగా తెలుగువారికి బాగా అనుభవం ఐంది. మొన్నటి వర్కింగ్ కమిటీ నిర్ణయం ప్రకారం, ఒకసారి ఎన్నుకోబడ్డ శాసనసభ ఆయుర్దాయం ఎన్నాళ్లో, అన్నాళ్లూ ఒకే నాయకత్వం ఉండాలి. ప్రతి సంవత్సరం జరిగే యీ తతంగానికి స్వస్తి చెప్పబడింది. బాహ్యదృష్టికి యీ నిర్ణయం శ్లాఘనీయమే అయినా, ప్రస్తుత పరిస్థితులలో అది కేవలం ఉన్నతాదర్శాల ప్రోద్బలంవల్ల మాత్రమే చెయ్యబడలేదేమో ననిపిస్తుంది. నేడధికారంలో ఉన్న కాంగ్రెస్ తన అధికారం సుస్థిరం చేసుకుందికి అవలంబించే మార్గాలు స్పష్టమైనవి కానక్కరలేదని కాంగ్రెస్ నాయకులు నిశ్చయించారనుకోడానికి పై రెండునిర్ణయాలునిదర్శనం. జాతీయసంస్థగా మన్నన పొందిన కాంగ్రెస్ నేడొక సంకుచిత రాజకీయ వర్గంగా రూపాంతరంపొంది నిలిచివుంది.

# ధర్మమే జయం

కౌండిన్య

"ఎందుకనో? మా కీ ఆకలి. దరిద్రులం కాబట్టేనేమో. మా కడుపుల్లో ప్రవేశించి ఎముక ఎముక సందునా పీల్చి పిప్పిచేయకపోతే అజీర్తితో తీసుకొనే భాగ్యవంతులదగ్గిరి కెందు కెళ్లకూడదు! ఆకలికూడా మా బీదవాళ్ల నెత్తు రంటేనే సరదాగాబోలు. అసలు దేవుడు మమ్మెన్ని పుట్టించింది బతకటానికిగాదూ? అయితే ఎందు కిట్లా వేధించటం... ఇంత బాధపడుతూకూడా బతకటంటే ఇంత తీపెందుకో... చావంటే అంత భయమేం?" అనుకుంటూ కునికిపాట్లు పడుతూ కూచున్నాడు యానాది, దీపపు స్తంభం పక్కనే గుడ్డపరచుకొని.

పట్టణమంతా దసరాతో చాలా సరదాగా ఉంది. పందిళ్లూ, పూల ఓడలు, భజనలు, హరికథలు, ఒకటేమిటి - అదొక స్వర్గమే! అప్పుడే సూర్యు డస్తమిస్తున్నాడు. ఒక ప్రక్కనుంచి చంద్రుడు రావటంచేత అంత చీకటిగా లేదు. రిక్షాల్లోనూ, జట్కాల్లోనూ, నడిచీ, ఎవరి ఓపికనుబట్టి వాళ్లు తమతమ ఊళ్లు చేరుకొంటున్నారు. కాని ఎవరూకూడా యానాది బొచ్చెలో చిల్లి కానీయైనా పడేసిన పాపాన పోలేదు; వాళ్లుకూడా పాపం హరికథల దగ్గిర. భజన్లదగ్గిర పళ్లెంలో వేసి జేబులు ఖాళీచేసుకు వస్తున్నారు. 'తమకా పుణ్యం చాలు!' అనుకునే వాళ్లూ ఉన్నారు అందులో.

యానాది కడుపు మండిపోతోంది. అకస్మాత్తుగా ఒక దృశ్యం అతనికంట పడింది. కోమటి రంగమ్మ రిక్షాలో పోతోంది. ప్రక్కనే ఏడేళ్ళ పిల్లాడు. పిల్లాడి చేతుల్లో వెండి విల్లంబు, తళతళా మెరుస్తోంది. పిల్లవాడు రిక్షా కదలికకు జోకొట్టినట్లు నిద్రిస్తున్నాడు. గంగమ్మ మనసువాడు తాను చేయాల్సిన పిండివంటల్లో మునిగి తేలుతోంది. ఆమె ప్రపంచం ఆమెది. యానాదికి ఒక ఊహ తట్టింది. నిద్రపోయే ఆ పిల్లాడి చేతుల్లో విల్లంబు లాగేయటం ఎంత సులభం?

'ఛీ! పాపం కాదా!'

'ఏం పాపమేం? వాడు చూడూ, ఆ పుల్లమ్మ- ఇట్లానేగా సంపాదించాడు ఎకరం కుంట!'

'పాడు ఉద్యోగం. నేను రోజూ వాణ్ణి తిట్టటం లా? అంతా సన్నిక అట్లాగే తిట్టరూ?'

'ఏం తిడితే? సుఖపడతావుగా!... అయినా ఎవరూ తిట్టేది? ఇట్లాచేసి బాగుపడ్డ వాళ్ళేగా! ఆడే చాలా ముందుకు వస్తోంది.'

'అమ్మో! నే చేయలేను. లోకం నన్నే మంటుంది - అయ్యో బాబో, తిట్టి పొయ్యరూ?'

'పోనీ తిట్టేలోక మేమైనా నీ పొట్ట నింపుతుందా?... జాగ్రత్తగా చేసి కొంచెం బాగు పడ్డావంటే నువ్వు తిట్టుతుం దనుకొన్న లోకమే నిన్ను నెత్తి నెక్కించుకొంటుంది. ఆ పుల్లాయికి చూడు, ఎంత గౌరవం వస్తోందో!'

'ఏమైనా సరే, చావనైనా చస్తాగాని చెయ్య లేను.'

'సరేను. పాపం! రత్తి నిన్నే ఆశపెట్టుకు నుందే, నాల్గురోజులనుంచి తిండిలేక - ఈ పాటికి చచ్చిపోతూ ఉంటుంది. వెళ్లి బతికించొద్దూ! లే, తొందరగా. నిమిషంలో ఐపోతుందిగా పని.'

ఇంతలోకే రిక్షా యానాది ముందుకు వచ్చింది. 'అమ్మా కాని డబ్బు' అని అరిచాడు. అతని అరుపు ఆమెను వినిపించనే లేదు. రిక్షా దాటింది. యానాదిలో నిశ్చయం వచ్చింది. లేవబోయి, తూలి తట్టుకుని నిలబడ్డాడు. రిక్షా ఒక గజం ముందుకు పోయింది. యానాది గబగబా నడిచాడు. అటూ ఇటూ పరకాయించాడు. మనుషులు చాలా దూరాన ఉన్నారు. చక్రం సందుగా చెయి పోనిచ్చి మెల్లగా లాగాడు విల్లంబు. చేతుల్లోకి వచ్చేసింది. పిల్లాడు ఉలిక్కిపడ్డాడు నిద్రలో. 'లేదులే,

ఊరుకో నాయనా!' అంటూ పిల్లాణ్ణి సముదాయించి మళ్లీ తన ప్రపంచంలోకి తాను పోయింది రంగమ్మ. యానాది ప్రక్క సందులోకి తప్పుకొన్నాడు. అంతా కనుమూసి కను తెరిచే లోపల జరిగిపోయింది. 'ఎంత తేలిక' అనుకొన్నాడు యానాది.

"ఈ సందులోనేగా సుబ్బారాయుడు సెట్టి వెండి కొట్టు.. ఎంత సంపాదించాడు, ఇలా దొంగసొమ్ము కొని. ఒకే చలాకీ. ఇట్టే పోలీసోళ్ళ కళ్ళలో దుమ్ము కొడతాడు. మా పుల్లడు-వాడు బాగుపడ్డాడు, సెట్టిని బాగుచేశాడు." అనుకొంటూ చింపిగుడ్డల చాటున దాచిన విల్లంబు ఉందో లేదో అని తడిమి చూసి తృప్తితో ముందుకు నడిచాడు. వెండికొట్టు సమీపించింది. అప్పుడే పుల్లడు వెండికొట్టు మెట్లు దిగి రోడ్డు మీదికి వస్తున్నాడు. "అదుగో, ఎవరి కొంపో తీశాడు..... అదేంటి వాడెందుకు తిట్టాలి! పండగపూటా ఆ పిల్లా డెంత ఏడుస్తాడో నాబోవానికి" అనుకొంటూ ముందుకు సాగాడు. కొట్టు చేరాడు. అప్పుడే పుల్లణ్ణి సాగనంపి సుబ్బయ్యసెట్టి లోపలికి పోతున్నాడు. యానాది అనుసరించాడు. లోపలి గదిలోకి పోయింతర్వాత నే చంకలోని వెండి విల్లంబు తీసి సుబ్బారాయుడి చేతుల్లో పెట్టాడు యానాది. సెట్టి కొంచెం ఆశ్చర్యపోయి-

"భలేది కొట్టుకొచ్చావురా!" అంటూ ఇటూ అటూ తిప్పి పరిశీలనగా చూశాడు. అతని నవ్వు కొంచెం మందగించింది. కాని గంభీరంగా-

"ఐతే సరేగాని ఎంత కిస్తానంటావురా!"

"ఏమో దొరగారి దయ. నాల్గురోజుల నుండి తిండికి మాడిపోతుండాను. నా కిదంతా కొత్త. ఇష్టమొచ్చినంత పారేయండి, పోతాను." అన్నాడు యానాది.

"సరే! ఉండు. ఇప్పుడే వస్తాను." అంటూ విల్లంబు చేత పట్టుకుని బైటికి వచ్చాడు సుబ్బారాయుడు.

అదే సమయానికి కానిస్టేబుల్ మల్లయ్య ఆ దారినే పోతున్నాడు.

"మల్లయ్యబాబూ! దేవుడిలాగా వచ్చావురా! భలే దొంగని పట్టిస్తా" అంటూ పిలిచాడు కానిస్టేబుల్ను, సుబ్బారాయుడు.

ఎన్నడూ ఎంత ప్రయత్నించినా వి ఆచూకీ ఇవ్వని సెట్టి ఈవాళ ఇలా తనంతటతానే ఆహ్వానించటం కానిస్టేబుల్కు ఆశ్చర్యాన్ని కలిగించింది. వెంటనే మెట్లెక్కి బయలుదేరాడు లోపలికి. పోలీసును చూసేటప్పటికి యానాదికి పైప్రాణం పైనే పోయింది.

"ఆ లైటు వెల్తుర్లో దీనిపై విలాసం చూడు మల్లయ్య బాబూ!" అంటూ విల్లంబు చేతికిచ్చాడు సెట్టి.

పరికించి, "బూరుగుల సుబ్బారాయుడు" అన్నాడు మల్లయ్య. యానాది ఉక్కిరి బిక్కిరైనాడు.

"ఔను బాబూ ఔను. మనదే. మొన్ననే మా వెధవకి చేయించా, మా యింటావిడ పోరు పడలేక. నూరు రూపాయిలైంది. ఎట్లా దొంగిలించుక వచ్చాడో వీడు. కష్టార్జితం, నడి సముద్రంలో పారేసినా నట్టింటికి వస్తుంది. ఏంబాబూ! ఏమంటావు? ఎట్లా ఐనా ధర్మానికే జయం."

"ఔను సెట్టిగారూ! ఏరా వెధవా!"

"క్షమించండి బాబూ, ఈరోజు బుద్ధి గడ్డి తింది" అన్నాడు యానాది వణికిపోతూ.

అదే సమయాన మల్లయ్య, సుబ్బారాయుడు చూపులు ఒకేసారి అక్కడ బల్లమీద పెట్టివున్న వెండిగిన్నెపై పడినై. మల్లయ్య ఆ గిన్నెను చూడటం సెట్టి కని పెట్టి తత్తరపడ్డాడు. ఆ గిన్నెవైపు నడవటం ప్రారంభించాడు. మొన్న రాత్రి పద జడ్జీ గారి ఇంట్లో దొంగలు పడి దోచుకుపోయిన వస్తువుల్లో ఈ నగిషీ వెండిగిన్నె కూడా ఉండడం అతని మనస్సులో స్పష్టంగా కన్పించింది. సెట్టి గిన్నె తీసి బీరువాలో పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

"సెట్టిగారూ! ఆగండి. ఆ గిన్నె నిటు తెండి."

"కాదండి" అన్నాడు సెట్టి వణికిపోయే కంఠంతో.

"కాదు లేదు, ఔను లేదు. ముందిటు తెండి" అన్నాడు. సెట్టిమీద తనకు చాలా కాలంనుంచీ ఉన్న ఆగ్రహం అంతా ఉట్టి పడేట్లు- జేబులోంచి బేడీలు తీశాడు మల్లయ్య. యానాదికి, సెట్టికి కలిపి తగిలించి-

"నడవండి స్టేషనికి అన్నాడు."

# 'జీవయాత్ర'

బాలాజీ

బొంబాయి రైలు మద్రాసు చేరుకొంటున్నది. మా వ్రాసిన పదహారు స్కెచ్చెస్ చదువుతున్నాను. మా గొంతుక గంభీరంగా పెట్టి "నాకు మనుష్యులంటేనే భయం" అన్నాడు. భయాన్ని అంత గంభీరంగా మరొకడే ఉచ్చరించగలిగాడు.

"సింహం బోనులో నిలుచుని దానితో చెలగాటమాడే మానవుడు మనకంటే ఎంతో సురక్షితంగా ఉంటాడు. కుల మత వైషమ్యాలతో నెత్తురు తాగే ఈ గూండాలకంటే ఆ సింహమే ఎంతో నయం." అని వైరెత్తాడు. ఇంతటి ఉద్రేకకరమైన భావాలను గట్టిగా గాలి పీల్చి నోసుండా అవగాహన చేసుకోవడం కష్టం. ఆవడిస్టేషన్లో కాందిశీకులు మిఠాయిలు అమ్ముతున్నారు. ఒక్క భాషకాదు. ఒక్క వేషం కాదు. 'కాందిశీకా' అనుకొంటూ వచ్చిన వాళ్ళను ఏకవచనం ఎలా వస్తుంది! మా జీవిత సారాన్ని బొట్లుబొట్లుగా మాటల్లో పోదిగి అంటుంటాడు. నా రుద్ధంగా "బోనులో సింహం ఆకలి తీరిన తర్వాత ఒక్క ప్రాణినైనా ముట్టుకోదు. ఈ కసాయి మనుషుల నెత్తురు దాహానికి మాత్రం అంతే లేదు" అని వాపోతున్నాడు. కవులు కన్నీరు కార్చారు, అగ్నికణాలను వర్షించారు. లాభం? ప్రపంచం కత్తికి కలానికికూడా లొంగడం మానేసింది.

కళ్ళను పుస్తకంలో పూడ్చేశాను. శబ్దమైంది. ఒకవైపున రైల్వే ఉద్యోగి మిఠాయి అమ్మే ఓ కాందిశీకుణ్ణి తన్ని తరిమేస్తున్నాడు. మరో వైపున ఓ అరవకుర్రాడు రైల్వే ఉద్యోగిని చూస్తూ హాసిస్తూ కాఫీ అమ్ముతున్నాడు. ఈ రైల్వే జీవులు దినానికి ఓ రెండు కప్పుల కాఫీతో తృప్తిపడతాయి. కాందిశీకుడి కీవిషయం ఏం తెలుసు! పైగా ఆ పిక్కురమెంట్లు వ్యాపారంలో వచ్చే లక్షల కిదొకటే తక్కువ.

నా మరీ ఘాటుగా ఉండడంవల్ల మూసి పెట్టాను. ఎదురుగా కూర్చున్న మార్వాడీ లలన బత్తాయిపండ్ల పిప్పిని సరాసరి నా పైజామా మడతల్లో విసర్జిస్తున్నది. మార్వాడీ షావుకారు స్పెన్సరు చుట్ట తాగుతున్నాడు. మావాడు "ఒరే అబ్బాయ్! చెరో వందరూపాయ లిచ్చేట్టయితే ఆమె ఉమ్మేసే బత్తాయి గింజలు గ్రహించటానికి నువ్వు, అతగాడు రాల్చే చుట్ట నుసి పోగుచెయ్యడానికి నేనూ దోసిలికట్టి నిలుచోమటా!" అన్నాడు. మావాడు జీవితాన్ని ఆర్థిక కోణంలో సార్థకదృష్టితో సాధిస్తాడు.

మా వేపు వెర్రిచూపులు చూస్తున్న అయ్యరు సతి పెద్ద కుంకుమరేఖతో, అమాయకపు వాలకంతో రైలుపెట్టెలోని స్త్రీ జనానికి గృహిణీత్వాన్ని గుండెల్లో మలుస్తున్నది. బండి మద్రాసు సెంట్రల్లో ఆగింది. మా కంపార్టుమెంటును ఇష్టం దటుకొని వీరవిహారం చేసిన యాంగ్లో ఇండియన్ చేడియను ప్రియుడు కలుసుకొన్నాడు. కొంపదీసి ప్లాట్‌ఫారాన్ని యూరప్ అనుకొని తన్మయత్వస్థితులై తన్మయావస్థలో ఆలింగన చుంబనాలు ప్రారంభిస్తారేమోనని మావాడు నన్ను చరచరా లాక్కొని వచ్చేశాడు.

సెంట్రల్లో ఉండే మాడరన్ కేఫ్‌లో కప్పు కాఫీ పావలాట. మింగుడుపడని కాఫీని మింగేసి యిదేమిటని మా వాణ్ణి చూశాను. "గాంధీ టోపీరా తమ్ముడూ!" అన్నాడు. కిక్కురు మనకుండా బస్సులో కూర్చొన్నాం. మా వాడు "ఏర్ యూ" అని చిక్కగా నవ్వి రంగంలోంచి తప్పుకున్నాడు. నా వెనకాలే ఓ కాలేజీ భామామణి బస్సెక్కింది. చోటులేక నిలుచుని "సీటు నా జన్మహక్కు" అనేట్టు చూచింది. మనకు ఈ ఆశ్రమంలో వీళ్ళ అవరాభిమానాలు అంత అవసరం లేదు గనక వెకిలి వేషాలకు అతీతమైన నావ

శాంతి విగ్రహ మైపోయాను. "మరీ యింత మొద్దుకరహా ఐతే యేలా" అని ముఖకవళికలు మార్చింది. "నువ్వు మానవుడివి (మగవాడివి) కావూ? నీకు హృదయం లేదూ? కరుణ లేదూ" లాంటి సినిమా ప్రశ్నలు ఆమె ముఖంలో క్షణాని కొక టగుపడ్డాయి. "ఈ విధ భరత నాట్యభంగిమలు ప్రదర్శిస్తుంటే చూడలేం" అని నేను ప్రజానీకాన్ని హెచ్చరించ బోయాను. ఇంతలో బస్సు ఆగింది. దిగవలసిన మధుర క్షణాలు ఆసన్నమయాయి.

బస్సు దిగి, యింత వేళం తిరిగి బాబాయ్‌గాడి కేమైనా పట్టుకవెళ్ళకపోతే బావుండదని బస్‌స్టాన్‌లో కేక్సు కొనేందుకు వెళ్ళాను. మా వాడు లేకపోయాడు. వాడికళ్ళయినా ఎరువు తీసుకుని చూసుండేవాణ్ణి. షో రూం అంత రమ్యంగా ఉంది. కావలసినవేవో తీసుకొని అవతలకొస్తే పొంతకుందంత కడుపు పూచిక పుల్లల్లాంటి కాళ్ళతో ఓకుర్రోడివాడు చక్కగా షో రూం అద్దాల కానుకొని చల్లగా ముష్టెత్తు కొంటున్నాడు. జీవితాకాశంలో వెలుగు చీకట్లు ఈలా పోట్లాడతాయి కాబోలు. గుండెల్లో ఏదో భావాన్ని ఎవరో బకెట్లతో తోడే స్తున్నారు.

ఇంటికి వెళ్ళితే శ్రీమతి విశేషా లేమిటి అన్నది. ఈ ప్రశ్నకు జవాబు - బొంబాయిలో చీరలు బాగున్నాయనీ, మంచిమంచి సిల్కులు అమ్ముతున్నారనీ, రకరకాల గాజులు రంగు రంగుల కుంకాలు బజార్లో దొరుకుతున్నాయనీ. కానీ నేను నాపుస్తకం పైనుంచీ బస్టాలో హోటలు వరకూ చూచిన దృశ్యాలను జటిల పదాలలో సంధించి శ్రీమతిపై కొదిలాను. శ్రీమతి మొహం ఎర్రబడింది.

"ఈ దినం రూపాయి పెట్టి పత్రిక కొంటే దాన్నిండా ఈ యాయగోలే. పుస్తకాలుకొనేది- పీనుగ పెంటలు, అస్థుల కటకట నినాదాలు, ఆకటిమంటల ఆరని అగ్నిహోత్రాలు. గుడ్డలు లేక సిగ్గు విడిచిన జీవాలు - ఈ ఘోరాలు చదవడానికేనా? ఈ అభ్యుదయ కవులకు బుద్ధుండ నక్కరలే? గీతగీతకీ యేడుపేనా? పుస్తకాన్ని చెత్త డబ్బాలోకి విసిరి పారేశాను. అభ్యుదయం దాన్లో ప్రారంభించనీ అని. ఎందు కిలాంటి చెత్తా చెదారం రాయడం?" అని నిలదీసి అడిగే సింది.

మాసిన గడ్డానికి సబ్బు రాసుకొంటూ ఆలోచిస్తున్నాను. శ్రీమతికి నాలుగు అక్షరం ముక్కలు రాక వాటికవి చెడ్డాయనేగానీ ఆమె భావాలతో నేనే రాయడం సంభవిస్తే పొకనాన్న ఘాటుగా సెటైర్సు రాసేవాణ్ణి. అవును మరి. వీళ్లను అభ్యుదయ రచయిత లనేదానికన్నా కాపీయిస్టు లంటే సబబేమో! "ఏధి మనిషి జీవితంలో సుఖమే లేదా? ఒక్క క్షణమైనా వాడి బతుక్కు సంతోషం లేదా? వాడికి నీ సాహిత్యం అందిచేనే ఆకటిమంటల భీకర చిత్రణను చూచి యింకా కుంగిపోడూ? వాడి జీవితంలోని మధుర క్షణాలను జ్ఞాపకం తెచ్చి నువ్వూ మనిషివేనని వాడి కేనాడైనా చెప్పావా? వాడి సమస్యల పరిష్కారంకోసం నీ బుర్రలో ఒక్క అణువైనా ఒక్క క్షణంకాలం వినియోగించావా?" లోను గుండెల్లోనుండి సీతికంఠం గావురుగొంతుకతో పొలికేక పెట్టింది.

చీకటి పడింది. దీపాలు వెలిగించారు, సన్న జేశారు. శ్రీమతి ముఖాన కోపం జారిపోయి సరసం, రసం పొంగుతున్నాయి. శ్రీమతి జళ్లో మల్లెలు తెల్లగా పూసి యిల్లంతా వాసనలు చల్లుతున్నాయి.

"సుందర జీవితాగమను నొక్కపుదోసి నిండ నింపి" శ్రీమతి తెచ్చింది. తెల్లవారింది. దిన కార్యక్రమం ప్రారంభమైంది. సిల్కు టై కట్టుకొని, ఉద్యోగానికి కవుతలకు రాముగుని ఆఫీసులో అడ గుమాస్తా కొనుదుగా కూర్చొంటే అర్జంటు ఫైలు "ఇదే లోకం, తెల్లోమూలోకమూ!" అని వెకిలి నవ్వు నవ్వింది.

బతుకంతా ప్రతిరోజూ "మళ్లీ ఎప్పాటల్లె తెల్లారిపోతుంటే" విస్తుపోయి చూస్తున్నాను.

వ్యక్తిస్వాతంత్ర్యం

# న్యాయశాఖ వేరిమికి నాంది

తాడిమళ్ల జగన్నాథరావు

న్యాయశాఖ, కార్యనిర్వాహక శాఖలు విభజింపబడి ఉండాలనే నినాదం ఇండియాలో ఈనాడు పుట్టిందికాదు. ఆ నినాదం కాంగ్రెసు సంస్థ స్థాపింపబడిన నాటినుండీ ఉంది. అసలు ఆ నినాదం అంకురమునకే ఎన్నో ఏళ్లగా తక్కిన దేశాల్లో ఉంది. ప్రభుత్వ పరిపాలనలోని శాసననిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయ శాఖలలో ఒకటికన్న ఎక్కువశాఖలు ఒకే వ్యక్తి చేతులలో ఉంటే ఆవ్యక్తి పరిపాలన నిరంకుశత్వానికి దారి తీస్తుందని ఏనాడో మాంటెస్క్యూ అన్నాడు. ఆనాటినుండి దానిని ఒక రాజకీయ సూత్రంగా అన్నిదేశాలవారూ పరిగణిస్తూ వచ్చారు. అనేక దేశాలవారు ఈ మూడు శాఖలూ ఒకేచోట కేంద్రీకరింప బడకుండా ఉండేటట్లుగా తమ రాజ్యాంగాలలో తగిన కట్టుదిట్టాలు చేసికొన్నారు. అంతమాత్రంచేత ఈ మూడుశాఖలూ ఒకదాని కొకటి తగలకుండా విడివిడిగా పనిచేస్తున్నాయని అనలేం. ఒక దానితో మరొకదానికి సంబంధం, ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉండడం జరిగి తీరుతుంది. కాని ప్రతిశాఖా తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకుండా రాజ్యాంగం కాపాడుతూ ఉంటుంది. ముఖ్యంగా న్యాయ, కార్యనిర్వాహక శాఖలు విభజింపబడా లనడానికి కారణం వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాపాడదామనే ఉద్దేశ్యమే. ఒక్కరే నేరారోపకుడుగాను, న్యాయ విచారణాధికారిగాను, తానిచ్చిన తీర్పును అమలు జరిపేవాడుగాను ఉంటే వ్యక్తిస్వాతంత్ర్యము మంటగలిసి పోతుంది. పోలీసు ప్రాసిక్యూటరును; ప్రాసిక్యూటరు జడ్జీని తన ప్రాబల్యంలోకి లాగుకొనేశక్తి కలిగిఉంటే ప్రజలకు న్యాయం జరగదు. కాబట్టి న్యాయ, కార్యనిర్వాహకశాఖల విభజన తప్పదు.

ఈపై సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకొనే మద్రాసు ప్రభుత్వం కార్యనిర్వాహక, న్యాయ శాఖలను విభజిస్తూ ఒక ప్రణాళికను తయారు చేసింది. ఈ ప్రణాళిక మొదట ఉత్తరార్కాటు, చెంగల్పట్టు జిల్లాలలో అక్టోబరు 2 నుండి అమలులోకి వచ్చింది. ఇదివరలో క్రిమినల్ న్యాయవిచారణశాఖ, రెవిన్యూవ్యవహారాలు ఒకే మాజిస్ట్రేటు చేతిలో ఉండేవి. ఇప్పుడు క్రిమినల్ న్యాయ విచారణశాఖ, రెవిన్యూ శాఖనుండి వేరుచేయబడి, సివిల్ న్యాయ శాఖతో కల్పివేయబడుతుంది. క్రిమినల్ న్యాయవిచారణ సరాసరి హైకోర్టు అధికారంలోకి వస్తుంది. ఇకముందు నుండి రెండు రకాల మాజిస్ట్రేటులు సృష్టింపబడతారు. ఒక రకం మాజిస్ట్రేటులను 'జుడిషల్ మాజిస్ట్రేటు' లంటారు. వీరు జిల్లా, సబ్‌డివిజనల్, సబ్ మాజిస్ట్రేట్లు అను మూడు తరహాలుగా ఉంటారు. న్యాయ నిర్వహణాధికారాలన్నీ వీరి చేతులలో ఉంటాయి. వీరు హైకోర్టు ఆధ్వర్యంక్రింద పనిచేస్తారు. ఇక రెండవ తరహా మాజిస్ట్రేటులు-ఎగ్జిక్యూటివ్ మాజిస్ట్రేటులు - శాంతిభద్రతల రక్షణ విషయాలు చూస్తారు. ఎప్పుడైనా అసాధారణ పరిస్థితు లేర్పడి, రెవిన్యూ అధికారులు గ్రామంలోలేని పరిస్థితులలో జుడిషల్ మాజిస్ట్రేటులే శాంతిభద్రతల విషయంలోగూడ ఆజ్ఞలు జారీచేస్తారు. జుడిషల్ మాజిస్ట్రేటులను హైకోర్టు ఆధ్వర్యంలో ఉంచడంతో న్యాయశాఖకు స్వాతంత్ర్యం లభిస్తుంది. న్యాయశాస్త్ర పట్టాలను పొందిన వారికే జుడిషల్ మాజిస్ట్రేటు పదవి లభిస్తుంది. ఈ ఉద్యోగులను నియమించే అధికారం పబ్లిక్ సర్వీసు కమీషనులకు ఇవ్వబడింది. ఈ మార్పులన్నీ క్రిమినల్ ప్రొసీజరు కోడుకు లోబడే చేయబడినాయి. కాబట్టి వి ప్రభుత్వ శాసనాన్ని

సవరించకుండా ఈ సంస్కరణ కేవలం ప్రభుత్వాజ్ఞలద్వారానే అమలులోకి తేవడానికి వీలయింది. ఈ సంస్కరణను అమలులోకి తేవడంవల్ల ప్రభుత్వాదాయంలో లోటుండదు. మహా అయితే మూడున్నర లక్షల రూపాయల వ్యయంమాత్రం అవుతుంది. ప్రజాదరణగల ఇట్టి సంస్కరణలను ఆచరణలోకి తెచ్చే సందర్భంలో ఇంత స్వల్పవ్యయం ఒక లెక్కలోనిది కాదు.

సుమారు అరవై ఏండ్లుగా కాంగ్రెసు సంస్థ ఈ సంస్కరణకై పోరాటం సల్పింది. అట్టి సంస్కరణను ప్రథమంగా మన మద్రాసు ప్రభుత్వం అమలులోకి తేగలిగినందుకు మద్రాసు ప్రభుత్వాన్ని అందరూ అభినందించవలసిందే. ఈ సంస్కరణను అమలులోకి తెచ్చే విషయంలో వెనుక ప్రకాశం మంత్రివర్గంలో న్యాయశాఖా మంత్రిగా ఉండిన శ్రీ భాష్యం చాలా కృషిచేశారు. ఆయన నియమించిన రాజఅయ్యర్ కమిటీలో నివేదింపబడ్డ అనేక విషయాలు ప్రస్తుత సంస్కరణలో పొందుపరచబడ్డాయి. వ్యక్తి స్వాతంత్ర్యం విషయంలో ఈ సంస్కరణ ఒక ప్రధాన అంశం. ఈ సంస్కరణ ద్వారా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాపాడాలనే తన ఉత్సాహాన్ని కాంగ్రెసు ప్రభుత్వం వెల్లడించుకొంది. న్యాయశాస్త్ర పట్టాలను పొందినవారే ఇకముందు న్యాయ నిర్వహణ అధికారులుగా వస్తారు కాబట్టి న్యాయం జరిగే సావకాశాలు ఎక్కువవుతాయి. ప్రధాన న్యాయమూర్తి చెప్పినట్లు ప్రజాస్వామికంలో కార్యవర్గంవారు తమ అధికారాలను దుర్వినియోగం చేయకుండా చూడడానికి ఈ సంస్కరణ ఎంతైనా ఉపయోగపడుతుంది. నిజంగా ఇది హిందూదేశ న్యాయ నిర్వహణ చరిత్రలో ఒక ప్రధాన ఘట్టం.

“బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో న్యాయకార్యనిర్వాహక శాఖలు కలసి ఉండటం ప్రతిఘటించవలసిన విషయమే; కాని నేడు ప్రజా ప్రభుత్వాలు పనిచేస్తున్నాయి. ఇవి బాధ్యతాయుతమైనవి. మాకు న్యాయశాఖలో కల్పించుకొనే దురుద్దేశ్యం లేదు. మేధావులైన న్యాయవాదులు, ప్రభుత్వ ప్రతికూలురు మాత్రమే నేడు కూడ ఈ శాఖల విభజన వాంఛిస్తున్నారు.” అనే భావం స్ఫురించేటట్లు మన మంత్రులు న్యాయ కార్యనిర్వాహక శాఖల విభజన సందర్భంలో ప్రసంగాలు చేశారు. కాని ప్రధానియే తన ప్రసంగంలో కార్యనిర్వాహకుల ప్రలోభం న్యాయనిర్వహణలో ఆటంకం కల్గించవచ్చును కాన ఈ సంస్కరణ అమలు జరుపక తప్పదని నిర్ణయించామని తెల్పారు. అధికారం అవినీతి మప్పడం సహజం. పరిపాలకులు పరాయి వాళ్ళయినా, లేక మనవాళ్లే అయినా ప్రలోభాలకు లోనుగావడం సహజం. కాబట్టి మనలను పాలిస్తున్నది మనవారే ఐనంత మాత్రాన ఇటువంటి సంస్కరణలు అనవసరం అని అనలేం. న్యాయస్థానముల అధికారాలను తొలగిస్తూ, తగ్గిస్తూ ఇటీవల చేయబడుతున్న శాసనాలను చూస్తే ఇటువంటి సంస్కరణల ఆవశ్యకత వ్యక్తమవుతుంది. రాజేంద్రప్రసాదు తమ సందేశంలో చెప్పినట్లు ఈ సంస్కరణ ఏనాడో జరిగివుండవలసింది. కాబట్టి వ్యక్తిస్వాతంత్ర్యాన్ని వాంఛించేవారు ఇటువంటి సంస్కరణలు వెంటనే అమలు జరగాలని తొందరచేస్తే అదేమీ అసహజం కాదు. ప్రభుత్వంవారి అంచనాల ప్రకారం 1950 నాటికి ఈ సంస్కరణ కనీసం సగం రాజధానిలోనైనా అమలు జరుగుతుందని తెలుస్తోంది. 1950 నాటికి రాష్ట్రమంతటా అమలు జరిగితే చాలా బాగుంటుంది. ప్రస్తుతం పరిశోధనకై రెండుజిల్లాలలోనే ప్రవేశపెట్టబడిన ఈ సంస్కరణలోని లోటుపాట్లు త్వరలోనే తెలుస్తాయి. లోట్లను సవరించుకుంటూ సంస్కరణను రాష్ట్రమంతటా త్వరలో అమలు జరపాలి. ఎగ్జిక్యూటివ్ మాజిస్ట్రేటులకు ఇంకా చాలా విస్తృతమైన అధికారాలు వదలివేయబడ్డాయి. అవి తగ్గించడం విషయంలో క్రిమినల్ ప్రొసీజరు కోడును సవరించడానికై ప్రభుత్వం వెనుదీయరాదు. అప్పుడే ఇండియాలోని న్యాయశాస్త్రానికి సంబంధించిన చరిత్రలో మద్రాసు నిజమైన ముందంజ వేసినదౌతుంది.






(గతసంచిక తరువాయి)

## ఇమ్మడి విరూపాక్షరాయలు
(క్రీ. శ. ౧౪౬౫-౧౪౮౫)

సాళువ నరసింహరాజు దేశాభిమానము గల దొర. ఒడ్డెవారియెడ నతనికి చెప్పరాని యేవగింపు; మాతృభూమిని యొడ్డెల దాస్యము నుండి యెట్టయిన విడిపింపవలయునని మొదటి నుండియు పట్టుబట్టెను; కాని కపిలేశ్వరుడు సజీవుడై యున్నంత కాలమును నతని కడక నెఱవేరినది కాదు. క్రీ. శ. ౧౪౬౭ వ సంవత్సరమునందా వృద్ధ యుత్కళ భూపాలుం డస్వస్థుడై స్వర్గస్థుడాయెను; అంతట చిరకాలము నుండి యతడు ప్రతీక్షించుచుండిన సమయము తటస్థపడినది; సాళువ నరసింహరాయల దండయాత్ర కపిలేశ్వరుని మరణమున కొక్కింత పూర్వము ప్రారంభమైనట్లున్నది. తీరాంధ్రభూమికి దక్షిణ ద్వారమనదగు నుదయగిరి తొలుదొల్త నతని దాటికి గురియైనది; నన్నెదిరింప వచ్చిన యొడ్డె దళములను సంగ్రామమున నిర్జించి యుదయగిరి కోటను లగ్గలుపట్టెను; కాని దండయాత్ర యటుపై సాగినది కాదు; దీనికి కారణము పాండ్యుల వెనుకపోటు. సాళువ నరసింహుని సైన్యము నుదయగిరిని ముట్టడించి యుండగా దక్షిణము నుండి పాండ్యభూపాలుడు, భువనైకవీర సమరకోలాహలుడు, చెవులపోతులతో కూడ వచ్చి తెగుఁభూములను ఠెంకుల గావించు కొనెను. * కావున సాళువ నరసింహుడు తీరాంధ్రదేశము మీది దండయాత్రను చాలించుకొని వెనుదిరిగి ద్రావిడ దేశమునకు పోవలసి

* అని సమకాలి కాంధ్రకవి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు చెప్పుచున్నాడు. ఆంధ్ర నిఘంటువు లన్నియు — అధునాతనమైన సూర్యరాయాంధ్ర నిఘంటువుతో కూడ — 'చెవులపోతు = శశము, కుందేలు' అనియే యర్థనిర్ణయము గావించి యున్నవి. పినవీరన సాళువ నరసింహుని యుద్ధక్రీడలను వేట వేటగ వర్ణించినాడు; కావున నతని వర్ణన శ్లేషభూయిష్ఠమై నరసింహుని పక్షమున నొక యర్థమును వేట పక్షమున మఱియొక యర్థమును గలిగి యున్నది. 'చెవులపోతు'నకు వేట పక్షమున కుందేలను నర్థము చెల్లును; కాని నరసింహుని పక్షమున చెల్లదు. కావున నరసింహుడు జయించిన 'చెవులపోతు' లెవ్వరో తెలిసికొనవలసి యున్నది. కొన్ని ప్రాచీన అరవ శాసనములందు పాండ్య దేశ వాస్తవ్యులు, 'లంబకర్ణ' జాతి ప్రజలుగ పేర్కొనబడి యున్నారు. 'లంబకర్ణ' యను మాటకు వ్రేలాడు చెవులని యర్థము. ఈ మాటకు అరవ 'తొళ్లకాదు' సమానార్థకము. తొళ్లకాదువారి జన్మభూమి నెట్టినాడు. కావున చెవులపోతులన నెట్టినాటి జనులని యర్థము.

వచ్చెను. నరసింహుడు వచ్చుచున్నాడని విని, సమర కోలాహలు డతని నెదుర్కొన సాహసింపక పత్వరముగ నిజరాష్ట్రమునకు పాఱిపోయెను; కాని సాళువనరసింహు డాతని వదలిపెట్టలేదు; సమర కోలాహలుని వెన్నంటి తఱుముచుపోయి పాండ్య మండలమును ప్రవేశించి తామ్రపర్ణీతీరమును జేరెను. అంతవరకు శత్రు నిరోధము మార్గమునందెచ్చటను నతనికి గలుగలేదు; తెంకాశి పాండ్య రాజు దళములను గూర్చుకొనివచ్చి యచట నరసింహుని కడ్డపడెను; కాని నరసింహుని బలాతిశయమునకు జంకి మలయపర్వత శిఖరమునకు పాఱిపోయెను; అంతట నతడు సైన్యమును మరల్చుకొని ముఖ్య స్కంధావారమైన మధురకు పోయి యచటినుండి, మరల రామేశ్వరమువఱకు దండయాత్ర నడపుకొనుచు పోయెను; అచట సింహళ ద్వీపాధిపతి యంపిన కానుకలను గ్రహించి యచటినుండి సైన్యమును నడపి యనంతశయనమునకు పోయి యా ప్రాంతమునందు చలనో నివసించుచుండిన గురుకర్ణ (లంబకర్ణు)ల మీద యుద్ధము నడపుచు నచట కొంతకాల మాగెను.

సాళువ నరసింహుని దక్షిణ దండయాత్ర జయప్రదముగ నెఱవేరెను. దక్షిణ దేశమందలి యల్లరు లన్నియు నణగిపోయినవి; పాండ్య రాజునకు దిరిసట్టు శాస్తియైనది. లంబకర్ణుల గర్వము నడుసినది. దక్షిణ దేశమున శాంతిని నెలకొల్పి రాజకీయ వ్యవహారములు యథాపూర్వము జరుగుటకు దగిన యేర్పాటులను గావించి, యుత్తరమున నొడ్డెవారిపై దండయాత్రను కొనసాగించు నుద్దేశముతో నరసింహుడు దీరాంధ్రమునకు మరలివచ్చెను. దక్షిణదేశమున నతడు యుద్ధము నడపుచుండినపుడు, తీరాంధ్ర దేశమున గొప్పమార్పులు సంభవించినవి. రాజ్యాధిపత్యముకొఱకు కపిలేశ్వరుని పుత్రులకు గలిగిన సంగ్రామమునందు హంవీరుడు పరాజితుడాయెను. విజయుడైన నిజసోదరుని యధికారము నంగీకరింప నొల్లక యతడు బహమనీ సుల్తానురెండవ మహమ్మదుషాహు సహాయము నపేక్షించెను. క్రొత్త రాజ్యములను సంపాదింప నాతురపడువాడగుట వలన మహమ్మదుషాహతని వేడికోలంగీకరించి తన ఘోటాలను నిజసామంతులలో ప్రధానుడగు మల్లిక నిజామ్-ఉల్-ముల్కు-ఖైరీ యాధిపత్యముక్రింద తీరాంధ్రమున కంపెను. నిజామ్-ఉల్-ముల్కు-ఖైరీసుల్తాను నాజ్ఞ చొప్పున దండు నడపుకొనిపోయి హంవీరుని గలిసికొని పురుషోత్తమునిపై యుద్ధమునకు దరలెను. ఉభయ బలములును సంగరాంగణమున దారసిల్లినవి. గొప్పయుద్ధము వాటిలినది. తురకలసహాయము వలన హంవీరునికి జయము గల్గినది. పురుషోత్తముడు పరాభూతుడై పాఱిపోయెను. అంతట క్రీ. శ. ౧౪౭౧వ సంవత్సరమున హంవీరుడు కళింగాధిపత్యము వహించి తనకు తోడ్పడినందు కొడంబడిక ప్రకారము బహమనీసుల్తానునకు వెలింగాణము మాత్రమే కాక తీరాంధ్రమును సర్వమును సమర్పించెను.

హంవీరుని త్యాగమువలన తీరాంధ్రమున కంతయు బహమనీ సుల్తానధిపతి యాయెను; తత్కారణమున సాళువ నరసింహుని రాజ్యపుటుత్తరపు పొలిమేర బహమనీరాజ్యమును దాకినది. కావున స్వరాష్ట్రసంరక్షణకొఱకు తత్పరుడై ప్రవర్తింపవలసివచ్చినది. మఱియు గజదేవుని దండయాత్రకు మునుపు విజయనగర సామ్రాజ్యాంతర్గతమై యుండిన కొండవీటి రాజ్యమును మరల సాధింపవలెనను యుద్దేశ్యము నప్పటి కింకను నెఱవేఱకుండెను. కావున నరసింహరాజు సైన్యములను నడపుకొని బహమనీ గడిదేశముపై దాడి చేసిపోయెను. సరిహద్దు ప్రాంతమును జేరగనే నరసింహరాజు బహమనీ సుల్తాను కనిగాపులై యుండిన జమీందారులతో సఖ్యము గావించుకొని సుల్తానుపై తిరుగుబాటుసేయ వారిని పురికొల్పెనని మహమ్మదీయ చరిత్రకారులు చెప్పుచున్నారు. అతని సలహా ననుసరించియే కాబోలు కొండపల్లి దుర్గాధిపతి సుల్తాను నాధిపత్యమును నిరసించి హంవీరుని రాజమహేంద్రవరముపై నెత్తిరా నాహ్వానించినది.

తనకు జేసిన సహాయమునకు ధృతిగ హంవీరుడు సుల్తానుకు వెలింగాణ తీరాంధ్రములను సమర్పించినను, నాసిమీద దురాశ యతని విడువలేదు; కొండపల్లి దుర్గాధిపు డంపిన వర్తమాన మందగనె యతడు దండుతో గదలివచ్చి రాజమహేంద్రవరమును ముట్టడించెను. అంతట కొండపల్లి దుర్గాధిపతియు సాళువ నరసింహరాజును దను

తన దళములతో గదలి హంవీరునికి బ్రాపుగనోయి రాజమహేంద్రవర సమీపమున గోదావరి కావలి యొడ్డున విడిసెను. మహమ్మదుశాహు పక్షమున రాజమహేంద్రవర దుర్గమును పాలించుచుండిన నిజామ్-ఉల్-ముల్కు-బెహరీ శత్రువులకు మార్కొని నిలువజాలక పరారియై పోయి తెలింగాణమందలి కొండపల్లి-వజీరాబాదున తలదాచుకొనెను; నాయకుడిట్లు కాలికి బుద్ధిచెప్పగా, చేయునదిలేక రాజమహేంద్ర దుర్గమునకు గాపుండిన సైన్యము హంవీరుని శరణుజొచ్చి కోట నతని కొప్పజెప్పెను.

తీరాంధ్ర వృత్తాంతము తెలియవచ్చినంతట సుల్తా నిమ్మడి మహమ్మదుశాహు ఫౌజులను గదల్చుకొని, ముఖ్యమంత్రి మహమూదుగావానును సర్దారులు నాయకులును గొల్వ సత్వరముగ బాచిచేసి పూర్వదేశమునకు వచ్చి చేరెను. అతడచటికి వచ్చునప్పటికి హంవీర సాళువ నరసింహుల సేనలు గోదావరీ పూర్వ పశ్చిమ తీరములందు విడిసియుండెను. కాని యుద్ధము జరుగలేదు. బహమనీసుల్తాను సైన్యముతో గోదవరీ దాటగనే, యుద్ధము చేయకుండగనే హంవీరుడు స్కంధావారము లేవనెత్తికొని కళింగమునకు మరలిపోయెను; సాళువ నరసింహుడు తన రాజ్యమువైపు తరలిపోయెను. శత్రువు లిట్లు సమరము చేయకుండ దారి విడిచిపోగా మహమ్మదుశాహు రాజమహేంద్రవరమును సులభముగ స్వాధీనము చేసికొని తత్ప్రాంత దేశమును జయింపదొడగెను.

బహమనీసుల్తానునకు బోటు జాలక సాళువ నరసింహుడు రాజమహేంద్రవర పరిసరముల నుండి దండు నేల తరల్చుకొనిపోయెనో తెలియదు; కాని యటుపిమ్మట నతడూరకుండలేదు. బహమనీసుల్తాను కళింగ దండయాత్రయందు నిమగ్నుడై యుండుటను గని కొండవీటిరాజ్యము నాక్రమించుట కిదియే మంచి తరుణమని గ్రహించి యచటి పట్టణములను దుర్గములను స్వాధీనపరచుకొన నారంభించెను. క్రీ. శ. ౧౪౭౦ సం॥ ప్రారంభమగునప్పటికి కృష్ణానదికి దక్షిణమున నుండు తీరాంధ్ర మంతయును గొండవీడు మొదలగు దుర్గములతోడను మచిలీపట్టణము మున్నగు రేవుపట్టణములతోడను నతని యేలుబడి క్రిందికి వచ్చినది. ఈ విజయముల మూలమున సాళువ నరసింహరాజు విజయనగర బహమనీ రాజ్యములకు మధ్య నుండిన పూర్వసముద్రతీరదేశమున కంతటికిని యధిపతి యాయెను; తెలింగాణమున గాని రాయసామ్రాజ్యమున గాని యతనికంటె బలాధికుడగు ప్రభు వెవ్వడును గానరాడాయె.

కొండవీటి దుర్గము నాక్రమించుకొనుట వలన సాళువ నరసింహునికి బహమనీ సుల్తానుతో యుద్ధము సంప్రాప్తమైనది. తత్పూర్వము కొన్ని యేండ్ల నుండి వారికి వైరము పెరుగుచు వచ్చినది. యుద్ధమున సాయము చేసినందులకు హంవీరుడు తీరాంధ్రమును బహమనీ సుల్తానున కిచ్చివేసినప్పటి నుండియు కొండవీడు రాజ్యమున కతడధిపతి యాయెను; కాని నరసింహుడు సుల్తాను నధికారమును గూలద్రోయుటకై తెగక ప్రయత్నము సేయుచు నీదేశపు జమీందారుల నతనిపై దిరుగుబాటు సేయ బురికొల్ప గడగెను. అంతట నిలువక కొండపల్లి దుర్గాధ్యక్షునితో గూడ నేకీభవించి యతని వెంబడి సైన్యమును గదల్చుకొని రాజమహేంద్రవరమునకు బోయి యా పట్టణమును సాధించుటకు హంవీరునకు దోడ్పడెను. తుదకు కొండవీటి దుర్గమును జయించి సదాశ్రయ రాష్ట్రమును వశపరచుకొనెను; కొండవీటి యాక్రమణము మొంటిసీపును విఱుచు గడ్డిపోచ యైనది. కావున సుల్తా నిమ్మడి మహమ్మదుశాహు సాళువ నరసింహరాజును దగిన రీతిని దండించి యతడాక్రమించుకొని యుండిన దుర్గములను రాష్ట్రములను మరల సాధించుటకు నిశ్చయించెను.

కొండవీటి దుర్గము సాళువ నరసింహరాజాక్రమించుకొన్నప్పుడు రెండవ మహమ్మదుశాహు రాజమహేంద్రవరమున వసించియుండెను. ఆవార్త తెలియవచ్చినంతటనె బలములను సత్వరముగ గదల్చుకొని వచ్చి కొండవీటికి ముట్టడివేసెను. అప్పుడచట సాళువ నరసింహరాజు లేడు; ఏ కారణము చేతనో తెలియదు కాని యతడా ముట్టడిని మాన్ప ప్రయత్నము సేయలేదు. తూర్పుతీరమునకు బాలదూరమున నెచటనో యతడు యుద్ధయాత్ర సేయుచున్నట్లు తోచుచున్నది. కొండవీడు సుల్తానునకు సులభముగ వశపడుట జూడగా సాళువ నరసింహుడా ప్రాంతమున లేడను సమా

చారమును దెలిసియే యతడు తిరిగివచ్చినట్లున్నది. మఱియు గొండవీటి విజయముతో దృప్తిబొందక సుదూరమున నుండు కాంచీపురమును కొల్లగొనుటకు సాహసించి పోవుటయు నీ యభిప్రాయమునే బలపఱచుచున్నది.

కొండవీటినుండి బహమనీ సైన్యము క్రీ.శ. ౧౪౮౧ వ సం॥ మార్చిమాస ప్రారంభమున బయలుదేరినది. పదిదినములు కూచిమీద కూచి చేసి నడచినది. నెల్లూరు జేరగనే సుల్తాను మహమ్మదుషాహా సైన్యమందు చాలభాగమును దన కుమారుడు మహమూదు ఖానునితోడను ప్రధానమంత్రి మహమూదు గావానునితోడను నచట నిలిపి కొంచెపాటి గుఱ్ఱపు దళముతో బయలుదేరి రాత్రియనక పగలనక నొకరాయికి ప్రయాణముచేసి కంచిని సమీపించెను. మార్గమునం దెచ్చటను శత్రువు లడ్డపడలేదు; హఠాత్తుగ వచ్చి పైబడుటవలన కాంచీపురజనులు మహమ్మదుషాహా నెదిర్చి తమ పట్టణమును గాపాడుకొనజాలక పోయిరి. దేవాలయములను సంరక్షించుటకొఱకు బాదరబాదరగ పోయిన కొలది జనులను మహమ్మదుషాహా సులభముగ దఱుమగొట్టి దేవాలయములను బట్టణమును కొల్లలాడి యెంతత్వరగ కంచిపై నడచెనో యంతకంటె వేగముగ నెల్లూరునందలి స్కంధావారమునకు వెనుదిరిగి వచ్చెను.

కాంచీపురమును కొల్లగొనుటవలన మహమ్మదుషాహునకు గొప్పదు ధనము విస్తారము చేకిక్కినది; కాని దాని నంతయు నతడు భద్రముగ గొనిపోజాలక పోయెను. మహమూదు గావానుని చారిత్రము నిర్మలమైనదనియు నతడు నిరపరాధి యనియు నిరూపించుటకొఱకు మహమ్మదీయ చరిత్రకారులు, కృత్రిమ లేఖ గాథ నొకదానిని గల్పించి, యీ యుద్ధయాత్ర యొక్క వాస్తవ వృత్తాంతమును గప్పిపుచ్చిరి. సమకాలిక అరబీ మహమ్మదీయ గ్రంథకర్తయగు సఖావీ, గావానుని మరణ వృత్తాంతమును క్రీ.శ. ౧౪౮౧-౧౪౯౭ సం॥ల మధ్య గ్రంథస్థము గావించెను. మహమ్మదీయ చరిత్రకారులు చెప్పు కృత్రిమలేఖ సమాచారము నతడెఱుగడు. గావానుని మరణము నతడు నీవిధముగ వర్ణించియున్నాడు.

'మహమూదు గావా నెల్లప్పుడును ధనమును వ్యర్థముగ వెచ్చపెట్టనిచ్చువాడుగాడు; అల్పులు సుల్తానుగారి వదాన్యతకును గౌరవమునకును పాత్రులుగారని మొదలించి యడ్డపడువాడు; సుల్తాను పెద్దవాడైన పిదప యథేచ్ఛగ దన్ను ప్రవర్తింపనీయక ఖ్వాజాగారి అడ్డపడుట యాతనికి నచ్చినదికాదు. కావున గురువుగారి కెట్లయిన స్వస్తిచెప్పవలయునని నిశ్చయించి సుల్తానను కాల సమయముకొఱకు వేచియుండెను. ఇట్లుండగా నరసింగదేశమునకు సుల్తాను పోవుట తటస్థించెను; పదునేను దినములు ఖ్వాజా సుల్తానును విడబాసియుండెను; ఆ యెడబాటును సందుచేసికొని యతని శత్రువు లతని నడవడిక సరియైనది కాదని దోషారోపణ చేయసాగిరి. సుల్తానుని కాంతరంగికులగు మంత్రులమూలమున సుల్తానంపినట్లు అంతకాల మెడబాటు గల్గినందులకు చింతించుచున్నాడనియు; నరసింగుని సైన్యము రాత్రియందు పైబడ బోవుచున్నదనియు; గావున తగురీతిని కటుబాట్లను గావించి యతని నెదుర్చుటకు సంసిద్ధుడైయుండవలసినదనియు హెచ్చరింపుచు వర్తమానమంపిరి. మహమూదు గావాను నీ హెచ్చరిక పత్రము కాదలచి, యది నిశ్చయముగ సుల్తాను కడనుండియే వచ్చెనని విశ్వసించి, యతని కవిషయమై యేమియు దెలియరాక పోయినను, వనక్రిందనున్న యోధులకు దక్షిణము యుద్ధసన్నద్ధులు గావలయునని యాజ్ఞాపించెను. ఆటుతరువాత నతని ప్రతిపక్షులు వేగిరముగ సుల్తాను చెంత కేగి మహమూదుగావాను సమయము జిక్కగనె సుల్తాను స్కంధావారముపైబడ సంసిద్ధుడైయున్నాడనియు; తమ మాటలను విశ్వసింపక పోయిన సుల్తానుగా రెవ్వరినేని బంపిన వారు వాస్తవము గనుగొని చూచి రాగలరనియు నివేదించిరి. సుల్తా నొకవేగులవాని నంపెను; వాడు పోయి వచ్చి గావానుడు యుద్ధప్రయత్నములు జేయుచుండుట సత్యమేయని చెప్పెను. మరుసటిరోజు మద్యపానముచే మత్తుడై సుల్తాను గావానుని సముఖమునకు రప్పించెను; తన యెడ శత్రువులు మోపబెట్టిన ద్రోహ దుర్వృత్తాంత మేదియు నెఱుగడు. అతడు ప్రవేశింపగనే సుల్తాను బానిసలలో నొకడు ఖడ్గముతో, నతడు మృత్యుదగువఱకును, ప్రహరింపదొడగెను; ఇది

౧౪౮౧ సఫరు ౫ వ తేదినాడు జరిగినది. అనదు ఖానుడుగూడ నా దినముననే వధింపబడెను. నేను మెక్కాలో నుండగ నీ దుర్వార్త యచటికి వచ్చి చేరినది. అచట దీని విన్నవారందఱును గడు దుఃఖితులైరి.'

సఖావీ వర్ణనయందు కృత్రిమలేఖమాట లేదు; కాని యప్పటివఱకు దన కత్యంతాప్తుడై యుండిన గావానుని, యతనిపైని యారోపణల సత్యాసత్యమును జక్కగనైన విచారింపక, సుల్తానేల జంపించెనో తెల్లమగుటలేదు. దీని రహస్యము సమకాలికాంధ్రరచనలవలన వెల్లడి యగుచున్నది. గావానుని శత్రువులు రాత్రి యతని స్కంధావారముపై నరసింగరాజు పడ నుద్యమించుచున్నాడని చెప్పిపంపిన వర్తమానము కేవల మబద్ధముగాదు; అందు చాల సత్యము గలదు. నా రుజ్జాయించినట్లు నరసింగరాజు బహమని స్కంధావారముపై నెల్లూరికడ బడలేదు; ఇంక కొంచెము త్తరముం దుండు కందుకూరికడ వారిని దాకెను.

౧ క్రీ. శ. ౧౪౯౦ వ సం॥నకు పూర్వమైన నూతనాంధ్ర వరాహపురాణ పీఠికయందు నరసింగక్షితిపాలుని యాజ్ఞ చొప్పున నగసా నాయకుని పుత్రుడైయగు నీశ్వరనాయకుడు కందుకూరికడ పెనుదకోట యవనాశ్వసైన్యమును నిర్మూలము గావించి వారి శిబిరములను గొల్లగొనెనని చెప్పియున్నది; ఈ యంశముచే నంది తిమ్మన తన పారిజాతాపహరణ పీఠికయందు చెప్పియున్నాడు. మహామూడు గావానుని యుద్ధ ప్రయత్నములను సాళువ నరసింహుని కవిదలను బరామర్శించి చూడగా సుల్తాను ముహమ్మదు షాహునకు దన మంత్రియును శత్రువును దన యధికారమును గూలద్రోయ నేకీభవించినారను నమ్మకము గల్గించియుండును. కావుననే యతడు సత్వరము గావానుని వధింప నాజ్ఞాపించెను; కాని యుద్ధమునం దీశ్వరనాయకునిచే బరాజితుడగుట వలన గాంచీపురమును లూటికొట్టి తెచ్చిన దోపిడి సంపటి నాతనికి సమర్పింపవలసి వచ్చినది.

కాఫరులచే గలిగిన పరాభవముచలన సుల్తాను ముహమ్మదుషాహు పరువు ప్రతిష్ఠలకు జాల లోటు వాటిల్లినది. కావున సాళువ నరసింహుని పై గసితీర్చుకొని నష్టమైన కీర్తిని మరల సార్జింపవలయునని నిశ్చయించి యతనిమీదికి యూసుఫు ఆదిల్ ఖాను, ఫత్రుల్ ముల్కులను సర్దారులను బంపి సైన్యము గదల్చుకొని కందుకూరినుండి తరలి మచిలీపట్టణమును దత్పరిసర భూములను జయించుటకు బోయెను. సుల్తాను కడక సంపూర్ణముగ నెఱవేఱినది. మచిలీపట్టణమును దదాశ్రయ రాష్ట్రమును ముహమ్మదు షాహునకు హస్తగతమైనవి; కాని యూసుఫు ఆదిల్ ఖాను ఫత్రుల్ ముల్కులు పరాజితులై వెనుదిరిగి పోవలసివచ్చెను.

సాళువ నరసింహుని సేనాధిపతియగు నీశ్వర నాయకుడు జయించిన స్థలములు పెక్కువ రాహ పురాణ పీఠికయందు పేర్కొనబడి యున్నవి. అందు ఉదయాద్రి, నెల్లూరు, అమూరు, కోవెల, కుందాణి, శ్రీరంగపట్టణము, నాగమంగలము, బెంగుళూరు, పెనుగొండ, గండికోటలు ముఖ్యమైనవి. ఇవిగాక జైమిని భారతమున బోనగిరి, చెంజి, కొంగుధారా పురములను సాళువ నరసింహరాజు జయించినట్లు చెప్పియున్నది. ఈ స్థలము లెప్పు డేసందర్భమున నీశ్వరనాయకునిచే గాని సాళువ నరసింహునిచే గాని జయింపబడెనో స్పష్టముగ జెప్పుటకు వీలులేదు. ఉదయాద్రియు నెల్లూరును క్రీ. శ. ౧౪౭౯-౮౦ వ సం॥న నడచిన యుద్ధ దండయాత్రయందు స్వాధీనపడి యుండవచ్చును; అమూరు (చెంగల్పట్టు జి.) బోనగిరి చెంజి దుర్గములును (ఉ. ద. ఆర్కాటు జి.), కోవెల (శ్రీరంగము, తిరుచినాపల్లి జి.) యును, క్రీ. శ. ౧౪౭౦ వ సం॥న నడచిన దక్షిణ దిగ్జయ యాత్రయందు వశమై యుండవలయును. కొంగుధారాపురము (కోయంబుత్తూరు జి.), కుందాణి (సేలము జి.), నాగమంగల బెంగుళూరు శ్రీరంగపట్టణములు (మైసూరు సం.), పెనుగొండ (అనంతపుర జి.), గండికోట (కడప జి.) లు క్రీ. శ. ౧౪౮౧-౧౪౮౫ సం॥ల మధ్య సాళువ నరసింహుడు దన యధికారము నంగీకరింపక ధిక్కరించిన దొరలను శిక్షింప నెత్తిపోయినపుడు కైవసమై యుండవలయును. బాగూరు పంచగ్రామముల నీశ్వర నాయకుడు పాడుచేసిన దీ సందర్భముననే కావచ్చును.

(సశేషము)

# మహాగీతం

దాశరథి

చరిత్రపాడని ధరిత్రి చూడని
పవిత్రగీతం పాడండీ
విచిత్రభూతం చూడండీ

నరాలలో తరతరాల గాథలు
శిరస్సులో నరనరాల బాధలు
గిరి శిరస్సుపై హరీంద్ర గర్జన
మన మనస్సులో తర్జనభర్జన
పరప్రభుత్వపు టురికంబాలు
ప్రజాప్రభుత్వపు గజిబిజి చర్యలు
స్వతంత్రమంటూ పెద్ద మాటలు
కుతంత్రాలతో గ్రుద్దులాటలు
విన్నాం కన్నాం కన్నాం విన్నాం

చరిత్ర పాడని ధరిత్రి చూడని
పవిత్రగీతం పాడండీ
విచిత్రభూతం చూడండీ

ఊరివూరి పొలిమేరలు మారి
దేశదేశ సహవాసం కోరి
జాతిమతాలను పాతరవేసి
సామ్రాజ్యాలకు సమాధిచేసి
అడుగు కడుగుకూ మడుగులుకట్టిన
రొదద నెత్తురులు వరదబోయించీ
ముల్లుముల్లుకూ చిల్కిన రక్తం
గులాబీల రంగులై వెలింగీ
యూరపు, తూరుపు, ఏషియా. రషియా
భారత, సింహళ, బర్మా, వియత్నాం
అమెరికా, బ్రిటన్ శ్రమజీవులతో-
శ్రమజీవులతో, సమభావులతో
అమర్చి కూర్చిన, జగాన్ని మార్చిన
విశాల విశ్వశ్రామిక భూతం
మహోగ్రభూతం
ఉల్కాపాతం
ఉత్తర ధ్రువాత్యున్నత శీతం
వజ్రాఘాతం
ప్రళయోత్పాతం—
పరుగెత్తే హిమగిరి
ఎగసు పడేచు గంగాఝరి,
కంపించే ఇలా తలం
కదలాడిన గభీర సముద్రజలం,
పేలిన కోటికోటి తారలు
కురిసిన ప్రళయ వర్ష ధారలు,
గిమ్మంలో తగులబడే
పెద్దపెద్ద కొండలు,
కరువులతో వణికిన
నిరుపేదల గుండెలు,
కేంద్రీకృత, పీడిత భూతం—

విరాట్ స్వరూపం
మహేంద్ర చాపం
ఉచ్ఛ్వసించితే, నిశ్వసించితే—
నింగి నంటు డాలరు గోడలు
నిల్చుతున్న బాంబుల మేడలు
నుగ్గునుగ్గుగా తగ్గిపోవునట !

"అద్ది రక్త గంగా తరంగమా!
అంత్య మహా యుద్ధరంగమా?"

"అమృతం ముందరి హాలాహాలం
పంటలు సిద్ధంకాని పొలం
ఫలితానికి ముందటి త్యాగం
నిరుపేదల నెత్తుటి రాగం
పడగెత్తిన మహోగ్ర నాగం
తగలబడే ధనికుల భోగం
అరుణారుణ విప్లవ మేఘం
నవయుగ మహా ప్రజౌఘం."

"ఆ మహాతరంగానికి ఆవతల?
ఆ యుద్ధరంగానికి ఆవతల?"

"నిజమై ధ్వజమెత్తిన కల
గగనానికి నిక్కిన పేదల తల
ఉక్కుటడుగు త్రొక్కిడిలో
పడి నలిగిన గడ్డిపోచ
చెక్కుచెదర కొక్కుమ్మడి
చక్కబడిన ఇనుప ఊచ
చనిపోయిన మృత్యు శవం
వినిపించని ధనారవం."

చరిత్ర పాడని ధరిత్రి చూడని
పవిత్రగీతం పాడండీ
విచిత్ర భూతం చూడండీ.




# సూర్యలోకపు వింతలు

రావిపూడి వెంకటాద్రి

సూర్యగోళాన్ని ఫోటో తీసినప్పుడు దాన్ని గురించిన వివరాలెన్నో బయటపడతాయి. మనకు వచ్చే వృత్తాకారపు బొమ్మలో మధ్య వున్నంత తెలుపు అంచుల వెంబడి వుండదు. మధ్యవుండే కాంతిలో నూటికి 40 భాగాలే అంచులవెంబడి వుండేది. దీనివల్ల సూర్యుడి వుపరితలమంతా వాయు స్వభావం కలదని స్పష్టంగా తేలిపోతుంది.

ఆ ఫోటోవల్ల మరొక వింత విషయం కూడా బయటపడుతుంది. సూర్యుడిలో అక్కడక్కడ నల్లటి మచ్చలు కన్పిస్తాయి. పూర్వంనుంచీ మన కవీశ్వరులంతా స్వచ్ఛమైన కీర్తిని సూర్యుణ్ణి పోలుస్తుండేవాళ్లు. సూర్యుడు స్వచ్ఛమైన తెలుపురంగు కలవాడనీ, కళంకం లేనివాడనీ వారలా చేశారు. కానీ మూడువందల సంవత్సరాల క్రిందటే గెలిలియో దూరదర్శినితో సూర్యుణ్ణి చూచినపుడు అతని కెన్నో మచ్చలు కన్పించాయి. దాని కతను ఆశ్చర్యపడ్డాడు. అవస్థలు పడ్డాడుకూడా. చుట్టూవున్న వాయువు కప్పులో యీ మచ్చలన్నీ ద్వారాలు. లోపల వుండే వుష్ణతీవ్రతకు తాళలేని వాయువులన్నీ యీ ద్వారాలగుండా బయటికివస్తాయి. సూర్యుడి వాతావరణంలో యివన్నీ సుడిగుండాలేనని చెప్పవచ్చు. మంచి ఒత్తిడిలోవున్న వాయువును ఒక్కసారిగా ఆ ఒత్తిడినుంచి తప్పించితే అది ఒకేసారిగా విస్తరించి చల్లబడుతుంది. అదే రకంగా యీ మచ్చ లేర్పడతాయి. సూర్యగోళం అంతర్భాగంలోవుండే వుష్ణతీవ్రతవల్లనూ ఒత్తిడివల్లనూ వ్యాకోచంకోసం పగిలిపోయి లోపలిభాగం మనకు నల్లగా కన్పిస్తుంది. ఈ మచ్చలన్నీ దాదాపు గుండ్రగానే వుంటాయి. 1905 లో కన్పించిన పెద్ద మచ్చలో మన భూమిలాంటివాటిని 40 యిముడ్చవచ్చు. ఎనిమిదివేల మైళ్ళ వ్యాసంగల యీ భూమివంటివి 40 ఒక్క మచ్చలో యిముడుతవంటే ఆమచ్చ ఎంత పెద్దగా వుంటవో మనం సులభంగా గ్రహించవచ్చు. దట్టంగా మంచు పట్టినప్పుడుగానీ, మేఘాలు అడ్డపడ్డప్పుడుగానీ సూర్య కిరణాల తీక్షణ తగ్గుతుంది. అప్పుడు మనం సూర్యుని వైపు చూస్తే యీ మచ్చలు కన్పిస్తవి. లేక పొగబట్టిన అద్దంకానీ, నల్లటి ఫోటో ఫిలింకానీ అడ్డంపెట్టుకొని చూచినప్పుడుకూడా యీ మచ్చలు కన్పిస్తాయి.

సూర్యుడికికూడా యీ కళంకా లున్నట్టు వరసగా 250 సంవత్సరాలు చూసినతర్వాత గానీ 11 సంవత్సరాల 1 నెల 15 రోజుల కొకసారి యీ కళంక చక్రం యేర్పడుతుందని కనిపెట్టలేదు. చివరకు ష్వాబ్ అనే ఖగోళ పరిశీలకుడీ సూత్రాన్ని కనిపెట్టాడు. రాయల్ ఖగోళ శాస్త్రజ్ఞుల సమాజంలో అతనికి బంగారుమెడల్ బహూకరిస్తూ జాన్‌సన్ యిలా అన్నాడు: 11 మొదలు 12 సంవత్స

రాలు తానా నిర్ణయానికి రావడానికి, తర్వాత ఆరు సంవత్సరాలు తనను తాను బాగా తృప్తి పరచుకోడానికి, తర్వాత 13 సంవత్సరాలు సమాజాన్ని తృప్తిపరచటానికి మొత్తం 31 సంవత్సరాలు పట్టుదలతో పనిచేశాడితను. 200 సంవత్సరాలపాటు ఖగోళశాస్త్రజ్ఞుల అనుమానాల కెంతో తావిచ్చిన అంశాల అంతు కనుగొనటానికి ఒక శాస్త్రజ్ఞుడు తన యావచ్ఛక్తి వినియోగించాల్సి వచ్చింది."

సూర్యుడిలోని మచ్చలు 11 1/8 సంవత్సరాల దాకా రెండు చక్రాలుగా పరిగెత్తుతుంటాయి. ఈ మచ్చలు చాలా ఉపరిభాగంలో ఉన్నప్పుడుమాత్రం సూర్యుడి ఛాయాతలంమీద బహుశా మనకు కనపడకపోవచ్చు. కనిపించినా యేకొద్ది మాత్రమో కనిపిస్తవి. తర్వాత చక్రాకారంగా వున్న ఆ మచ్చలు పెరుగుతూ వెడతాయి. ఇవి యిలా $4\frac{1}{3}$ సంవత్సరాలలో అనేకంగా పెరిగి తర్వాత $6\frac{1}{3}$ సంవత్సరాలలో క్రమేణా తగ్గిపోతాయి. చివరకు యేమీ లేకుండా పోతాయికూడా. వున్నా యేకొద్ది వుంటాయో. ఇలా జరిగినతర్వాత మళ్ళీ వాటి పెరుగుదల ఆరంభమవుతుంది. వెనకటిమాదిరిగానే $4\frac{1}{3}$ యేండ్లు పెరిగినతర్వాత $6\frac{1}{3}$ సంవత్సరాలలో క్షీణించి పోతవి. ఈ క్రమం యెప్పుడూ జరుగుతూనే వుంటుంది. కానీ యీ క్రమానికి హేతువేమిటో సరైన రుజువు లేదు.

వృక్షాల పెరుగుదలకీ యీ మచ్చల పరిమాణానికీ చాలా సంబంధం వుంది. ఈ కళంకాల ననుసరించి సూర్యుడి ప్రసారంలో 11 1/8 సంవత్సరాల కొక్కొక్క మెట్టుగా వస్తున్న మార్పుకు తగినట్టుగా చెట్ల పెరుగుదల కూడా 11 1/3 సంవత్సరాల కొక మెట్టు కనిపిస్తుంది. పెద్ద పెద్ద చెట్ల బెరడు వలయాలు 11 1/3 సంవత్సరాల కొకసారి యేర్పడుతున్నట్టు కావలసినంత ఆధారం దొరుకుతుంది. ఆ విధంగా శిథిలవృక్షాల్ని పరిశీలిస్తే గడచినకొన్ని వేల సంవత్సరాలనించీ యీ 11 సంవత్సరాల కళంకచక్రం అచంచలంగా వున్నట్టు స్పష్టమయింది.

సూర్యుడి ఉపరితల ఉష్ణోగ్రతకంటే యీ మచ్చల్లో వేడి తక్కువగానే వుంటుంది. చుట్టూ వున్న కాంతివంతమైన ప్రదేశంతో పోటీపెట్టినప్పుడు యీ మచ్చలు నల్లగా కనిపిస్తవేగాని మామూలుగా అవి కాంతి విహీనమైనవి కావు. సూర్యుడి అంతర్భాగంనుంచి పైకి లేచి సుడితిరిగే వాయుమండలాల వల్ల యివి యేర్పడుతున్నవని మన మింతకుముందే తెలుసుకొన్నాం. అవి విస్తరించేకొద్దీ వేడిని కోల్పోతవి. ఈ విషయం కూడా మన మింతకుముందే తెలుసుకున్నాం. అదే సమయంలో బయటికి వస్తున్న వాయువువల్ల యేర్పడ్డ సుడిగుండాల్లోకి సూర్యుడి ఉపరితలనుంచి వేడివాయువులు లాగబడతాయి. అప్పు డొక విచిత్రమైన వలయాకార గమనం కల్గుతుంది. ఈ మచ్చలు చలాకీగా వున్నప్పుడు అరోరాకాంతు లేర్పడతాయి. అలాంటి సమయాల్లోనే రేడియో సర్వీసు తలక్రిందులై పోతుంది. సూర్యునిలోని కల్లోలిత ప్రాంతాలనుంచి వచ్చే యెలక్ట్రాను తుంపరల మూలకంగా యీ అరోరా కాంతులు కల్గుతాయి. సూర్యవాతావరణాన్ని వదలిన తర్వాత కొన్ని రోజులకి యెలక్ట్రానులు మన వాతావరణంలోకి చేరుకొంటాయి. అలాంటప్పుడు టెలిఫోన్, టెలిగ్రాఫ్ సర్వీసులను కూడా ముప్పు వస్తుంది.

ఇటీవలే రాడర్ల ద్వారా సూర్యుడిలోనుంచి వింతవింత ధ్వనులు వింటున్నారు. మొదట 1936 లో సూర్యుడి కళంకంలోనించి బయలుదేరిన ధ్వనులు విన్నారు. ఆ ధ్వనులు పగలే కాని రాత్రి వినిపించేవి కావు. యుద్ధంరోజుల్లో యీ రాడర్లు బాగా అభివృద్ధి పొందాయి. శత్రు విమానాలు యెంతో దూరంలో వుండగానే అవి వస్తున్నట్టుగా ముందుగానే తెలుసుకోటానికి వుపకరించేవి. వాటినే ఖగోళాలకు వినియోగించడం వల్ల చాలా విశేషాలు బయటపడ్డాయి. 1942 ఫిబ్రవరి 27, 28 తేదీలలో 4, 6 మీటర్ల మీద పనిచేస్తున్న రాడర్లు తరచుగా కొన్ని ధ్వనులను విన్నాయి. ఈ కథంతా పగలే. అవి శత్రువిమానా లనుకొన్నారు మొదట. ఒకదానికొకటి 15 మైళ్ళ దూరంలో వున్న రెండు రాడర్లలో నుంచి వాటిని విన్నారు. రాడర్లతో పాటు వుండే దూరదర్శనుల గుండా ఈ శత్రు విమానా లెక్కడివా అని చూశారు. సరిగ్గా

సూర్యుడు కన్పించాడు. అది నిజంగా శత్రువు చేసే ధ్వని అయితే ఆ శత్రువు సూర్యుడి మీద కూర్చొని వుండాలి. అయితే ఆ శత్రువు? సూర్యుడిమీది కళంకం.

1946 లో అలాంటి ధ్వని ఒకటి చాలా పెద్దదిగా సూర్యుడి అంచులమీద విన్పించింది. ఫిబ్రవరి 7 వ సూర్యగోళం మీద కేంద్ర యామ్యోత్తర రేఖకు ఇవతల కొంత దూరంలో ఒక పెద్ద మచ్చ కన్పించింది. అప్పుడే పెద్ద అయస్కాంతపు తుపాను రేగింది. 30 గంటల సేపుదాకా వుంది. 13 వ తేదీ కూడా మరొక అయస్కాంత కల్లోలం చెలరేగింది. కొంతమంది సూర్యోదయానికి పూర్వమూ సూర్యాస్తమయానంతరమూ కూడా సూర్యుడి నుంచి శబ్దాలు విన్నారు. సూర్యుడి భ్రమణం సగం పూర్తి అయేసరికి మళ్ళీ మచ్చలు కన్పించినవి. ఐతే మునుపటి వాటికంటే చిన్నవి. ధ్వని కూడా చిన్నది. మీటరుకంటే తక్కువ తరంగ దైర్ఘ్యంలో చిన్న చిన్న అసాధారణ శబ్దాలు విన్పించాయి. 1-5 మీటర్లలో అదే స్పష్టంగా విన్పించింది. తరంగ దైర్ఘ్యం 5 మీటర్లదాకా పెరిగే కొలదీ శబ్దస్ఫుటత్వంకూడా పెరిగింది.

సూర్యుడినుంచి మనకు చేరే ప్రసారాల్లో విద్యుదయస్కాంతప్రసారం కాంతి వేగంతో వస్తున్నది. ఈ విద్యుదయస్కాంతప్రసారం సూర్యుడిలో బాగా సంచలనం వున్న ప్రాంతాల నుంచి వస్తున్నది. సూర్యుడు మనకిస్తున్న ధ్వనులకు గానీ, అయోనీకరణానికిగానీ కారణం యిదే నంటాడు, సర్ యెడ్వర్డ్ ఆప్లిటన్. అసలు యీ అయస్కాంతపు తుపానులకి కారణం భూమి వైపు వస్తున్న ఆవేశకణ మేఘాలే.

ఈ అభిప్రాయాన్ని నాంటర్ విల్కిన్స్, కేంబ్రిడ్జి, పరిశోధన శాలలలో ప్రకటించారు. పై ఫిబ్రవరి తుపానుల్ని చూసినప్పుడు విశేషణలతో గమనిస్తే ఆ మేఘం భూమివైపే సెకండుకు 450 మైళ్ళ వేగంతో వచ్చినట్లు తెలిసింది.

భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నట్లుగానే సూర్యగోళంకూడా తనచుట్టూ తాను భ్రమణం చేస్తున్నది—యీ తిరగడం పడమర నుంచి తూర్పుకు. ఒక్కొక్క భ్రమణానికి చాలా కాలం తీసుకొంటుంది. ఐతే సూర్యగోళమంతా ఒకే వేగంతో భ్రమణం చేయదు. మధ్య రేఖా ధ్రువాలవద్దర ఒక భ్రమణానికి 35 రోజులు తీసుకొంటుంది. మధ్య రేఖవద్ద 25 రోజులు తీసుకొంటుంది. దీన్నిబట్టి సూర్యగోళం మొత్తంగా తనచుట్టూ తాను ఒకే వేగంతో తిరగడంలేదనీ, మధ్యరేఖా ప్రాంతంకంటే ధ్రువప్రాంతంలో చాలా ఆలస్యంగా తిరుగుతున్నదనీ స్పష్టమవుతుంది. అంతేకాక మధ్యరేఖా ప్రాంతంలోనే రెండు వేగాలతో తిరుగుతుంది. సూర్యుని మధ్య రేఖ 24½ రోజులకే ఒక భ్రమణాన్ని పూర్తి చేస్తే, అక్కడనే మచ్చలున్న ప్రదేశం 26 రోజులు తీసుకొంటుంది. ఇది జరగాలంటే సూర్యుడు వాయుపదార్థగోళమై తీరాలి. సూర్యుడి మధ్యరేఖలోని ప్రతి అణువూ (ఉపరి భాగంలో) కేంద్రంచుట్టూ సెకండుకు 6000 అడుగుల వేగంతో తిరుగుతున్నది. అంటే సూర్యుడి మధ్యరేఖమీద పడమటి అంచుల్లో అణువులు ఆ వేగంతో మనవైపునుంచి పోతున్నవి. తూర్పువైపువి అలాగే మనవైపు వస్తున్నవి.

సూర్యుడిమీది వేర్వేరు ప్రాంతాల్లోని వేర్వేరు వేగాల్ని నిర్ణయించటానికి సూర్యుడి మీది మచ్చలు బాగా వుపకరిస్తాయి. అసలు సూర్యుడు భ్రమణం చేస్తున్నాడనీ, విభిన్న అక్షాంశాలదగ్గర విభిన్న వేగంతో భ్రమణం చేస్తుంటాడనీ, అందువల్ల సూర్యగోళం వాయురూపంలో వుంటుందనీ మొట్టమొదటిసారిగా తెలుసుకోగల్గింది యీ మచ్చలవల్లనే. సూర్యగోళం ఒక్కసారి తనచుట్టూ తాను తిరగటానికి మధ్యరేఖా ప్రాంతంలో 25 రోజులూ, 30° దగ్గర 27 రోజులూ, 45° దగ్గర 29 రోజులూ, ధ్రువ ప్రాంతంలో 35 రోజులూ తీసుకొంటుంది.

మచ్చలకులోను సూర్య వాతావరణంలో జ్వాలాచాపాలుకూడా మనకు కన్పిస్తవి. అంటే నల్లటి మచ్చ ఎలా మనకు కన్పిస్తున్నదో అదే విధంగా తెల్లని వెలుగులుకూడా మనకు కన్పిస్తున్నవన్నమాట. అంచులు కాంతి విహీనంగా వుంటవి కాబట్టి అంచులవెంబడి యీ కాంతి జ్వాలలు మనకు బాగా కన్పిస్తవి. ఇవి దాదాపు 5000 మైళ్ళ వెడల్పునుంచి 40,000 మైళ్ళ పొడవుదాకా కల్గి చాలా దినాలపాటు వుంటవి.

ఐతే మచ్చలమాదిరిగా యీ మంటల మేఘాలు సంవత్సరాల తరబడి వుండవు, యేకొద్ది నిమిషాలపాటో వుంటవి. దాదాపు 25 నిమిషాలకు అవి మాయమైపోతవి. సూర్యకాంతి విశ్లేషిణితో చూస్తే యీ జ్వాలా మేఘాల పైభాగంలో నల్లటి మచ్చ వొకటి వుంటుంది. ఈ మచ్చ సాధారణంగా మొట్టమొదట అతివేగమైన ఊర్ధ్వగమనం, తర్వాత అదేరకంగా అధోగమనం చూపిస్తుంది. తేజస్వంతమైన యీ జ్వాలా మేఘం సూర్యుడిలో కన్పించినపుడల్లా భూమి అయస్కాంత క్షేత్రంలో కొన్ని మార్పులు వస్తూనే వున్నవి. భూమి అయస్కాంత బలాన్ని, దాని దిశనూ చూపించే అయస్కాంతపు పనిముట్లన్నీ కొంత దెబ్బ తింటవి. తర్వాత 24 గంటలకు అక్కడనుంచి బయటకు కొట్టబడ్డ విద్యుత్కణాలు భూమికి చేరతాయి. కాబట్టి భూమి అయస్కాంతంమీద వాటి జోక్యం హెచ్చుతుంది. అయస్కాంతపు తుపాను లేస్తుంది. అరోరా కాంతులు కన్పిస్తవి. ఈ విద్యుత్కణాలు భూ అయస్కాంత క్షేత్రంవల్ల ఆకర్షించబడి అతివేగంగా వచ్చి భూమిని తాకుతాయి భూమి వాతావరణంమీద మార్పు వస్తుంది.

మనకు ధ్రువప్రాంతాల్లో 60 మైళ్ల యెత్తున అరోరా కాంతులు కన్పిస్తున్నవి. అక్కడ వుండే వాతావరణ వాయుపీడనం చాలా తక్కువ. కాబట్టి కొన్ని మూలపదార్థాలు యితరపరిస్థితుల్లో చూపించే వర్ణపటానికి విభిన్నంగా చూపిస్తున్నవి. మన రాత్రి ఆకాశం రంగును సృష్టించడంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న ఆకుపచ్చ అరోరా రేఖను మొన్న మొన్నటిదాకా శాస్త్రజ్ఞులు కనుగొనలేక పోయారు. నత్రజని మూలద్రవ్యం వున్నందువల్ల అలా జరుగుతున్నదని రుజువైంది. సూర్యుని జ్వాలా మేఘాలద్వారా విడదిపెట్టబడ్డ విద్యుత్కణాలు భూమియొక్క అయస్కాంత ధ్రువాలకు ఆకర్షించబడి అరోరాకాంతు లేర్పడుతున్నవి.

ఇక రేడియో తరంగాల్ని ఒక చోటినుంచి మరొకచోటికి పంపడంలో సౌరజ్వాలా మేఘాలు నిర్వహిస్తున్న పాత్ర అతిముఖ్యమైంది. వేలకొలది మైళ్లనుంచి అప్పటికప్పుడు శబ్దాన్ని మనం పొందగల్గుతున్నామంటే వీటి మహాత్మ్యమే.

గోడచాటునవున్న మనిషి మనకు కన్పించాలంటే అద్దంలో చూపించాలి. ఆ మనిషినుంచి వచ్చే కాంతి కిరణాల్ని ప్రతిబింబింపజేసి అద్దం మనకు యే రకంగా చూపిస్తుందో అదే రకంగా శబ్దాన్నికూడా ప్రతిబింబింపజేసే అద్దంలాంటి మధ్యవర్తి కావాలి. ప్రదేశంలోకి పోయే కాంతి కిరణాల్ని నిరోధించి అద్దం మనకు ప్రసరింపజేస్తున్నట్టుగానే ఉత్పత్తి అయిన శబ్దాన్ని ప్రదేశంలోకి పోనివ్వకుండా భూమిచుట్టూ తిరిగేట్టుగా చేయటానికి మరొక మధ్యవర్తి కావాలి. అలాంటి మధ్యవర్తులు కొన్ని శబ్దంకూడా భూవాతావరణంలోనేవుండి ప్రతిబింబింపచేట్టు చేస్తున్నవి. అవి విద్యుత్స్వభావంకలవి. సూర్యుడినుంచి వచ్చే అతినీలలోహిత కాంతి హ్రస్వతరంగాల్ని వాతావరణం జీర్ణించుకొంటుంది కాబట్టి సూర్యకాంతి మీదనే వాటి విద్యుదీకరణం ఆధారపడి వుంటుంది. సూర్యుడి కళంకచక్రం మారేకొద్దీ దాని విద్యుదీకరణం యొక్క అతిశయంకూడా మారుతుంది.

ఇటీవలే పెద్ద పెద్ద జ్వాలా మేఘాలు కన్పించినవి. [illegible] మార్చి సెప్టెంబరు నెలల్లో పరిశీలకులు చాలా పెద్దవాటిని చూశారు. రేడియో హ్రస్వతరంగాలు దెబ్బతిని రష్యా అమెరికాలమధ్య రేడియో సర్వీసుకూడా చాలానాళ్లు దెబ్బతిన్నది.

సూర్యగ్రహణం పట్టినపుడు సూర్యబింబం కన్పించక దానిచుట్టూ కాంతి వలయం మాత్రమే కన్పిస్తుంది. దాన్నే కాంతిచక్రం (Corona) అంటారు. సూర్యుడు అత్యుష్ణగోళం కాబట్టి, అందుండి బయటకు కొట్టబడే విద్యుద్రేణువులు ఆగోళం చుట్టూ యీ కాంతిచక్రాన్ని సృష్టిస్తున్నవి.

సూర్యుడినుంచి వుద్గతమయే యీ పదార్థమంతా వాయురూపమైంది. అందులో ఉదజని కాల్షియంలాంటి పదార్థా లుంటవి. ఈపదార్థం వందలాది మైళ్ళ వేగంతో యెగిరిపోతుంది. అందులో కొన్ని జ్వాలలు మేఘాల మాదిరిగా దట్టంగా వుంటవి. ఈ ఉద్గత మేఘజ్వాలల రూపేణా గానీ, యితర ప్రసారాల రూపేణా గానీ సూర్యుడినుంచి ప్రతి నిమిషానికి 24 కోట్ల టన్నుల పదార్థం బయటికి వస్తున్నది.

ఒక రాయి తీసి విసిరాడు. పండ్లు రాలినాయి. ఇంకా కొన్నాళ్ళకు చెట్టు ఎక్కకుండానే ఒక గడకు కంచికట్టి కాయలు కోసుకున్నాడు. ఈ విధంగా తన మనుగడకై మానవుడు చేసిన కృషి అంతా కార్యకారణ సంబంధం గలది. ఈ కార్యకారణ సంబంధజ్ఞానమే-జ్ఞానపిపాస అయి స్వేచ్ఛాపిపాస అయి- సత్యాన్వేషణకు ఆస్కారం అయింది. సత్యాన్వేషణ నిరంతరమయి యథార్థం అయినది. యథార్థమయినది నవ నూతనమై మరి విలువగల దయినది.

కాబట్టి మానవులందరూ ప్రాథమికంగా హేతువాదులని అంగీకరిస్తూ వారిలోని అంతర్గత హేతువాదమును బహిర్గతం మొనర్చుటకు మానవుని ఆసక్తులకూ రుచులకూ భిన్నంగాని ప్రయత్నం చేయాలి. ఎందుకంటే మానవునికి మంచీ చెడూ విమర్శించేశక్తి ఉన్నది. ఆశక్తితో అతని అంతరంగంలో గల సమన్వయంతో అనుబంధించని నీతిని అతడు తోసేస్తాడు.

నీతిని- విలువలనూ, పారమార్థికంగానూ, వర్గ యుక్తంగానూ భావించక యథార్థమగు జగత్తులోని అంశాలని గ్రహించాలి. దానిని మానవుడు తన మంచికోసమే అవలంబించగల జ్ఞానాన్ని అతనికి ఇవ్వాలి. జ్ఞానం కంటే అజ్ఞానం పెద్దది. అజ్ఞానం తగ్గాలంటే పరిసరాల జ్ఞానం వ్యక్తి ప్రయత్నంమీదనే ఆధారపడుతుంది. ఆ పనికి సహాయం చేసే ఇతర వ్యక్తులుండాలి. అయితే ఈ వ్యక్తులు నిర్లిప్తంగా సమష్టిగా చింతించి పరిశోధించి పరస్పర అభిప్రాయ సేకరణతో నీతినీ- జ్ఞానాన్నీ సమన్వయపరచ గలుగుతారు.

నీతి వ్యక్తిగతమయినదే. అయితే సంఘంలో పరావర్తన మందినప్పుడు యథార్థదృష్ట్యా సమన్వయ మవుతుంది. ఆ సమన్వయం ఏ అంకం కించ పడకుండానే జరుగుతుంది. నీతి నిజమయింది కావడానికి వ్యక్తులు ఒకరి నొకరు సహనంతో అర్థం చేసుకోవగల వేదిక కావాలి. దాన్ని ఎట్టి భయానకమైన క్రమశిక్షణా లేకుండా వీలయినంత ఎక్కువ వ్యక్తి స్వేచ్ఛ నిస్తూ నిర్మించుకోవాలి. ఆ వేదిక మీదనే వ్యక్తినీతి సాంఘిక నీతిగానూ, ధర్మంగానూ సమన్వయ స్వరూప జ్ఞానంతో మారకలదు.

ఇప్పుడు మనం ఉన్న దశలో ప్రతిదేశమూ ఒకప్పుడు ఉన్నది. కాని ఆయాదేశాలు "మా దేశమే గొప్పది, నేం నేర్చుకోవాలిసింది ఏమీ లేదు" అని మడికట్టుకుని కూర్చోలేదు. సహనంతో, సమర్థతతో, వివేకంతో తర్కించి, విమర్శించి, పరిశీలించి ముందుకు పోతున్నవి. అట్టి కార్యక్రమానికి మనం పూనుకోవాలి. దిగగలం. చేయగలం. కాని వ్యక్తికి ఆశయం, ప్రగాఢత కావాలి. అని చెప్పడం కన్న చేసేవారిని చూస్తే అలవడుతవి.

నీతి, కోరిక- ఈ రెండూ భిన్నమయినవనే భావం తొలగిపోవాలి. కోరికను హేతువాద దృష్ట్యా తర్కించుకొన్నప్పుడు నీతి అవుతుంది. నీతివంతమయిన చర్య జ్ఞానఫలిత మవుతుంది. ఇంతేకా జ్ఞాన సంపదా మనుజుని తనితర సృష్టికంటే వేరు పరచినది. ఆ జ్ఞాన సముపార్జనకు కావాల్సిన నిరంతర కృషిని మానవుడు చేయగలగాలి. అందుకు కొన్ని ఇబ్బందులు లేక పోలేదు. కాని జ్ఞానంపట్ల అభిమానం జాస్తి అయినప్పుడు ఈ అడ్డంకులుచాలవరకు తొలగుతవి.

నీతికి ఆస్కారం ప్రకృతిలోని మూలమయిన మానవుల సహజవ్యాపారం. ఆ వ్యాపారమే నీతి కాదు. అది మానవ అంతస్థులలో నీతి అవుతుంది. మంచి చెడులను సాంఘిక దృష్ట్యా విమర్శించుకోగల తాహతే నీతి అయితే, సంఘం తన కన్న భిన్నమయిందయినా తన ఆసక్తులూ, ప్రవృత్తులూ ఒక్కొక్కసారి సంఘానికి వ్యతిరేకం కావచ్చు. దాని తప్పొప్పులను కార్యకారణవాద దృష్ట్యానూ, అనుభవం దృష్ట్యానూ నిర్ణయించగలం. దీనికంతకూ మానవుణ్ని సర్వానికీ మూలంగానూ, సర్వానికీ అధినేతగానూ అంగీకరించగలగాలి. అంతేకాని అతన్ని ధర్మం, నీతి, తత్వం పదాలకు బలి చేయ సాగితే ఫలితం అరాజకం, భీభత్సంమాత్రమే అవుతుంది. పిల్లవాణ్ని దండించి శిక్షించి చేస్తున్న చెడును ఆపివేయగలం. మంచిని చేయడం మాత్రం నేర్పలేము. మంచిని చేసిచూపి, మంచికి నమూనాగా ఉండి మంచిని నేర్ప గలం. ఇదే కాలజ్ఞానం.

**అభిప్రాయ వేదిక:**

# ఏది అభ్యుదయ సాహిత్యం?

కొత్తపల్లి రంగారావు

సెప్టెంబరు 2, 9 తేదీల "తెలుగు స్వతంత్ర" సంచికలలో అభ్యుదయ సాహిత్యాన్ని గురించి శ్రీ ఆరుద్ర, కొడవటిగంటి కుటుంబరావు గార్లు అవగాహనను కలిగిస్తూ, కొన్ని విపరీత వ్యాఖ్యానాలూ, తప్పుడు నిర్వచనాలూ గావించారు. ఆరుద్రగారు 'ప్రజాసాహిత్యం' అనే శీర్షిక కింద యిలా వ్రాశారు.

"అభ్యుదయ సాహిత్యానికీ ప్రజాసాహిత్యానికీ గల తేడాని చాలామంది గుర్తించినట్టు లేదు. ఇటీవల రెండూ ఒకటేనన్న పొరపాటు అభిప్రాయాన్ని చాలామంది చాలాచోట్ల వ్యక్తపరుస్తున్నారు."

"జానపద సాహిత్యం ప్రజాసాహిత్యానికి మరో పేరు."

"అభ్యుదయ సాహిత్యం కేవలం కావ్యానికి సంబంధించిన మాట అని అభ్యుదయ రచయితలు గుర్తుంచుకోవాలి."

"నేడు చాలామంది రచయితలు మధ్య తరగతి నుంచే వస్తున్నారు. వీరు తమ విజ్ఞానంతో ఒక ప్రత్యేకమయిన సంస్కారాన్ని సృష్టించుకొంటున్నారు ..... ఈ రచనలను తీసుకెళ్ళి గ్రామీణులకు వినిపిస్తే ఇవి వాళ్లకు బోధపడక పోతే తప్పు రచయితదీ గాదు; గ్రామీణుడిది అంతకన్నా కాదు."

"మన రచయితలు అభ్యుదయ సాహిత్యాన్నే కాక ప్రజాసాహిత్యాన్ని కూడా సృష్టించడం ప్రారంభిస్తే మంచిదే; గానీ ఆ తరగతి యొక్క సంస్కారం తెలియనివాళ్ళని ఆ తరగతి సాహిత్యాన్ని గానీ, ఆ తరగతిమీద సాహిత్యాన్ని గానీ సృష్టించమనడం భావ్యం గాదు. నిజానికి ప్రయత్నించినా, ఏ రచయితకీ సాధ్యం గాదు. బాధ్యత గుర్తెరిగిన రచయిత అసలు ప్రయత్నించడు."

ఇలాగే నడిచింది వ్యాసం అంతా.

ఇక కుటుంబరావుగారు 'నా కథారచన' అనే శీర్షిక క్రింద —"నేను అభ్యుదయ వాదిని. సాహిత్యంద్వారా మనుషులు ఉత్తేజితులవుతారనీ, జీవితాన్ని అర్థం చేసుకోగలుగుతారనీ, వారి భావాలు ముందుకు పోతాయనీ నా దృఢ విశ్వాసం."

అని మళ్ళీ—

"అయితే, నేను మధ్యతరగతి సంస్కారం గలవాణ్ణి. ఈ సంస్కారంతో నేను అభ్యుదయ రచనలు చేయగలను గాని ప్రజాసాహిత్యమూ, శ్రామికవర్గ సాహిత్యమూ సృష్టి చేయలేను. అందుచేత నా రచనలు ప్రజాసామాన్యాన్నీ శ్రామికులనూ ఉత్తేజపరచలేవు. కాని మధ్యతరగతివారికి ప్రజాజీవితానికి అనుకూలించే సాహిత్యం తెలిస్తే అవకాశం ఉంది. ఈ పని ఎంత విజయవంతంగా చెయ్యగలిగితే నేనంత ఉత్తమ కథకుణ్ణి అనిపించుకుంటాను."

అని వ్రాశారు.

పై వ్యాసాలలోని వారి అభిప్రాయాలను స్థూలంగా యిలా చెప్పవచ్చు.

(1) అభ్యుదయ సాహిత్యమూ, ప్రజాసాహిత్యమూ ఒకటి కాదు. ఒకటిగా నక్కరలేదు. రెండూ వేరువేరు సాహిత్యాలు. (2) మధ్యతరగతినుంచి వచ్చిన రచయితలు మధ్యతరగతిని దప్పితే, ప్రజలకు ప్రజాసాహిత్యాన్ని సృష్టి చేయలేరు.

ఇవి ఎంతవరకు నిజం? ఏది అభ్యుదయసాహిత్యం? మధ్యతరగతినుంచి వచ్చిన రచయితలు ప్రజాసాహిత్యాన్ని సృష్టి చేయలేరా?

ఇవి మనం చర్చించి పరిష్కరించవలసిన సమస్యలు.

ప్రజల లోకమును ముందుండి వారి పరిస్థితులనూ సమస్యలనూ అర్థం చేసుకొని, వారికి పరి

త్మైన మార్గాన్ని చూపిస్తూ, ఉద్బోధాన్ని ఉత్తేజాన్నీ కలిగించి కర్తవ్యోన్ముఖుల చేసి పాత వ్యవస్థలను ధ్వంసం గావించి వాటి శిథిలాలపై నూతన సమాజ నిర్మాణాన్ని గావించడానికి పురికొల్పేదే అభ్యుదయ సాహిత్యం. అదే నిజమయిన ప్రజాసాహిత్యం.

కనుక, అభ్యుదయ సాహిత్యంగానిది ప్రజాసాహిత్యంగాదు. ప్రజాసాహిత్యం గానిది, అది అభ్యుదయ సాహిత్యం గానేరదు.

పై వర్గాల సాహిత్యమూ, ప్రజల సాహిత్యమూ మొదటినుంచీ, ప్రతి యుగంలోనూ (ఈనాడుకూడా) వేరువేరుగా ఉంటూండడం వాస్తవమే. విషయంలో మాదిరిగానే, భాషలోనూ, శిల్పంలోనూ, రూపంలోనూ, శైలిలోనూకూడా వీటికి భేదం ఉండడంకూడా నిజమే. (కుసలాయకం లాంటివి పై తరగతి సంస్కృతికి చెందినవే. విషయంలో హెచ్చు భేదం లేకుండా మిగిలిన వాటిలో మాత్రమే భేదం గలిగిన జానపద వాఙ్మయం లాంటివే నేడు యింకా నిలిచివున్న జానపద వాఙ్మయంలో హెచ్చుగా కన్పిస్తోంది. ఇది కేవలం పైతరగతి సంస్కృతే. ప్రజల్లో హెచ్చుగా ప్రచారంగావడానికి ప్రజల కర్థమయే పద్ధతిలో పైతరగతి రచయితలుగాని, ప్రజలనుంచివచ్చిన రచయితలుగాని వ్రాసినట్టివి.)

అయితే, జానపదసాహిత్యంలోని మెరుగులను, ప్రజల నాకర్షించే కొన్ని గుణాలను జీర్ణం చేసుకుని, యీ పై వర్గాల వాలారు గొప్ప రచయితలు కొంతమంది వాటిని తమ రచనల్లో లీనం చేసుకున్నారు. అలా లీనం చేసుకున్న రచనలే ఉత్తమ రచనలైనవి. అంచేతనే అవి నేటికీ ఉత్తమ కళాఖండాలుగా ప్రజలచే పరిగణించ బడుతున్నాయి.

మనం వాఙ్మయ చరిత్రను గతితార్కిక చారిత్రక-భౌతిక వాదదృష్ట్యా అర్థం చేసుకోవాలి గాని ముక్కుకు సూటిగా ఋజురేఖలో గాదు.

ఇక యీనాటి సంగతి. ఈనాడు జానపద సాహిత్యం వెనకటి ప్రత్యేక గుణాలతో కొత్తగా ఏదీ ప్రత్యేకంగా ఉత్పత్తిగావడం లేదు. కారణం: ఆయా ఘటనలను, ప్రజా సమస్యలను తీసుకుని, ప్రజలనుంచి వచ్చి, ప్రజల్లో పనిచేసే అభ్యుదయ రచయితలే ప్రజాసాహిత్యాన్ని లేక అభ్యుదయ సాహిత్యాన్ని ఉత్పత్తిచేస్తూ ప్రజావసరాలను తీరుస్తున్నారు. అయితే, ప్రజలనుంచి వచ్చినా, కొంతమంది ప్రారంభావస్థలోని రచయితలు శిల్పంలో తగిన నైపుణ్యం చూపించలేకపోవచ్చు. ప్రజల నాకర్షింపగల ఉత్తమ సాహిత్యాన్ని సృష్టిచేయలేకపోవచ్చు. మరి కొంతమంది పైతరగతినుంచి వచ్చిన మేధావులు ప్రజలకు బాగా అర్థమయేలా, అందుబాటులో ఉండేలా వ్రాయలేకపోవచ్చు. పైతరగతినుంచి వచ్చినా, క్రిందితరగతినుంచి వచ్చినా, లేక మధ్యతరగతినుంచి వచ్చినా కొంతమంది రచయితలు ప్రజా సమస్యల నర్థం చేసుకుని ప్రజల భాష నలవరచుకొని, జానపద సాహిత్యంలోని మెరుగులను జీర్ణంచేసుకొని, జానపద రూపాల్లో, మంచి శిల్పంతో ఉత్తమ తరగతి ప్రజాసాహిత్యాన్ని లేక అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. అంచేత, పైవర్గాల సాహిత్యానికీ ప్రజాసాహిత్యానికీ మధ్యమాదిరిగా, అభ్యుదయసాహిత్యానికీ ప్రజాసాహిత్యానికీ మధ్య అఖాతాన్ని కల్పించ జూడడం అభ్యుదయ వాదులమని చెప్పుకొనే వాళ్ళకు తగదు.

ఇక "చాలామంది రచయితలు మధ్యతరగతి నుంచే వస్తున్నారు" గాబట్టి వాళ్లు రచయితల్లో తమకున్న మెరిట్‌నిబట్టి తమ విజ్ఞానంతో ఒక ప్రత్యేక సంస్కారాన్ని-"త్రిశంకు స్వర్గాన్ని"- సృష్టించుకొంటారని. అది తీసుకుపోయి గ్రామీణులకి వినిపిస్తే అది వారి కర్థంకాకపోతే తప్పు తమదికాదు వారిదేనని తాము తప్పులో జారడం-ప్రజాసమస్యలపై ప్రజల కర్థమయేలా వ్రాయడం యిష్టంలేక "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అనే ధోరణిలో ప్రజాజీవితం నుంచి పలాయనం చేయాలనే దృష్టి (ఎస్కేపిజం) తప్ప మరేమీగాదు.

ప్రజల కర్థమయేట్లు, వారు మెచ్చుకొనేట్లు వ్రాయలేకపోతే, అది—"నీ కవిత్వం... నా కవిత్వం...ఇంకొకడి కవిత్వం జనసామాన్యం వాంఛించ [illegible], ఇంకొకడి తప్పూ [illegible] శ్రీ చెప్పినట్లు, రచయిత తప్పు అవుతుంది. ప్రజ లే వశ లో [illegible] గా అర్థం

చేసుకొని వారికర్థమయ్యేలా వ్రాసి వాటిని ముందుకు తీసుకు పోవలసిన బాధ్యత తప్పకుండా రచయిత మీద ఉంది.

రచయిత ఏ తరగతి వాడైనా, క్రిందితరగతి పీడిత ప్రజానీకపు కష్టాలను గురించి వ్రాయాలనుకొంటే వ్రాయడం అద్దుర్ర కుటుంబరావుగార్లు భావించేంతకష్టం కాదు గాను. అయితే, అందుకు నిరంతర ప్రయత్నమెంతో అవసరం. ప్రజా ఉద్యమాల్లో పాల్గొంటూ వారి కష్టసుఖాలనూ, చిత్త ప్రవృత్తులనూ పరిశీలించడం అవసరం. పుట్టినదాది మనిషి విజ్ఞానాన్ని సంపాదించడానికెలా కష్టపడుతున్నాడో, అలాగే ప్రజాసాహిత్యాన్ని సృష్టించి ప్రజాహృదయ నిర్మాత గావడానికి కూడా శ్రమించాలి. కుటుంబరావుగారు-మార్క్సిజాన్ని అధ్యయనం చేయడంవల్ల తమకెంతో మేలు కలిగిందనీ, సమాజ వ్యాధినిగురించీ, దాన్ని బాగుచేసే విధానాన్ని గురించీ మొదటిసారిగా తెలుసుకొన్నాననీ తామే వ్రాశారు.

రచయితను తాను వ్రాసే విషయాన్నిగురించి వివరంగా తెలియనిదే వ్రాయకూడదు. నిజమే. కాని, తాను వ్రాసేది హెచ్చుమంది ప్రజలు ఉపయోగించినప్పుడే గదా తన రచనకు సార్థక్యం? తన రచనకు హెచ్చు ప్రయోజనాన్ని ఆపేక్షించే రచయిత, రచయితగా తన బాధ్యత గుర్తెరిగిన రచయిత అందుకోసం తప్పకుండా ప్రయత్నిస్తాడు. ఎంతైనా శ్రమపడతాడు. జూలియస్ ఫ్యూచిక్ మొదలయిన ప్రముఖ రచయితలు చిత్రహింసలకు గురై మృత్యువును సయితం ధిక్కరించారు.

రచయితలందరూ పట్టణవాసులు గారు. పట్టణంలో ఉన్నా తమచుట్టూ బీదప్రజలూ కార్మికులూ ఉండకపోరు. మధ్యతరగతి అన్నంత మాత్రాన తమచుట్టూ రోజూ చూచే క్రింది తరగతి ప్రజా జీవితానికి దూరం గానవసరంలేదు. దూరం గావాలి అనుకోకుండా ఉండాలి. తెలుసుకోవాలి అని దీక్షతో కృషి సల్పాలి.

ఏ రచయితైనా, కార్మిక జీవితంతో సంబంధం లేకుండా పెట్టుబడిదారీ జీవితాన్ని, తన చుట్టూ ఉన్న బీద ప్రజానీకంతో సంబంధం లేకుండా మధ్యతరగతి జీవితాన్ని ఎలా చిత్రించగలడు? స్వల్పంగా, ఒకవేళ ఏమైనా వ్రాసినా, అవి వాస్తవికతకు సంపూర్ణమైన ప్రతిబింబం మాత్రం కానేరదు. తప్పులతడక, అబద్ధాల పుట్ట మాత్రం అవుతుంది. ప్రజలందరికీ సంబంధించిన ఆర్థిక సామాజిక వైజ్ఞానికాది వివిధ జీవిత కోణాలనుంచి వేరుపడిన పచ్చి సెక్సు కథలనే వ్రాసినా అవి కేవలం నీరసం, నిర్జీవంమాత్రమే అయి తీరా సారస్వతంలో చేరతాయిగాని, కుటుంబరావుగారాశించినట్లు ఉత్తమ కథలు మాత్రం గావు.

హెచ్చుగా మధ్యతరగతి పాత్రలనే తీసుకుని వ్రాసినా, జీవితాన్ని గురించి దృక్పథం అభ్యుదయకరమైనప్పుడది ప్రజలకుపయోగించే ప్రజాసాహిత్యం అవుతుంది గాని వేరుగాదు. ఈరోజు మధ్యతరగతి అనేక జీవిత సమస్య లెదుర్కొంటున్నాయి. ఆ సమస్యలు ప్రజాసమస్యలతో ముడిబడే ఉంటాయి. ఉదాహరణకు- ఉపాధ్యాయుల సమస్యలు విద్యార్థులవి కూడాను. వాటికోసం పోరాడితే అది ప్రజాపోరాటంగాక ఏమవుతుంది? అందుచేత ప్రజలు వాటికి సానుభూతితో చూడ్డమేగాక ప్రత్యక్షంగా సహాయం కూడా చేస్తారు. కనక జీవితం సర్వతోముఖమైనది. సర్వులనూ సంబంధించింది. అది సమగ్రంగా అర్థం చేసుకుని వ్రాసిన ప్రతి రచనా ప్రజాసాహిత్యమే.

ప్రసిద్ధ రచయితలనేకమంది మధ్యతరగతి నుంచి వచ్చారు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ మొదలయిన వారంతా మధ్యతరగతి వారైనా ప్రజాజీవితాన్ని గురించి ఎలా వ్రాయగలిగారు? నూతనసమాజ నిర్మాత లెలా కాగలిగారు? టాల్‌స్టాయ్ నిరంకుశ రాజవంశాన్నుంచి వచ్చాడు.

ప్రజాసాహిత్యాన్ని వ్రాయలే మనుకోడం మనిషికి తన కళ్లూ, హృదయం, మేధస్సు తాలూకు శక్తి సామర్థ్యాల్లో విశ్వాసం లేకపోవడమే అవుతుంది. సంస్కారం మనిషి శ్రమపడి సంపాదిస్తే వచ్చేదిగాని, పుట్టుకతో వచ్చేది గాదు.

తన వర్గప్రవృత్తినీ, వర్గప్రయోజనాన్నీ వదిలి పీడితవర్గ దృష్టి నలవర్చుకొన్నప్పుడు పీడిత

అపారమైన దేశసేవ చేసి, దేశంయొక్క సంపద పెంచటానికీ, అంతర్జాతీయ వాణిజ్యం పెంపొందించటానికీ తోడ్పడతారని విశ్వసించుదాం..."

ఈలోగా ఉపన్యాసకుడికి అసలువిషయం మరిచిపోయాన్నని తోస్తుంది.

"సోడా అంటే జ్ఞాపకంవచ్చింది. మేమంతా పంథొందల ముప్ఫయ్యేట్లో వేలూరు వజ్జయిల్లోంచి మద్రాసు వస్తుండగా దాహమయింది. ఎక్కడా నీళ్లు లేవు. స్నేహితువాళ్లు పిలిచి తలా పది సోడాలూ తీశాం. మహా బాగున్నాయి."

ఇంకా అసలు విషయం అందటంలేదు.

"ఇదంతా ఎందుకు చెప్పానంటే ఇప్పుడు మనం (హే దేశ భక్తులారా!) పడ్డ కష్టాలు వృథా కాలేదు. గాంధీజీ ధర్మమా అంటూ మనం (డిటో) గట్టెక్కాం. స్వరాజ్యం వచ్చింది. స్వాతంత్ర్యం వచ్చింది. దేశం ఇంకోళ కాక పోతే రేపన్నా సుభిక్షం అయితీరవలసిందే. దీనికి తిరుగులేదు. మీరు సందేహించవలసిన అవసరం ఏంకమాత్రమూ లేదు."

కాస్త పాకాన పడుతున్నది.

"ఇక ఆంధ్ర రాష్ట్రం మాటా. అది వస్తుంది. రాకేం చేస్తుంది? ఎందుకు రాదు? ఎవరికోసం వస్తుంది? రాక ఎక్కడికి పోతుంది? మన పట్టాభి ఉన్నాడు, మన నెహ్రూ ఉన్నాడు, మన సర్దారున్నాడు, మన - మన - మన వాళ్లంతా ఉన్నారు. మనమందరమూ ఉన్నాం."

(హర్షధ్వానులు)

ఉపన్యాసం రక్తి కట్టేస్తున్నది. ఈ వేడిమీదే రెండు దెబ్బలు కొట్టాలి.

"ఆంధ్ర రాష్ట్రం వస్తున్నది-వచ్చేసింది! ఇక మనం దాన్నిగురించి ఆలోచించవద్దు. దాన్ని పూర్తిగా మరిచిపోమ్మని మనవి చేస్తున్నాను. (చప్పట్లు) కాని-ఆంధ్ర రాష్ట్రం వచ్చిందని సంతోషమూ, కానేకాదు! ఆంధ్రరాష్ట్రం రావటం ప్రధానం కానేకాదు. అసలది, నన్నడిగితే అనవసరం, వ్యర్థం, నిరుపయోగం. (వినేవాళ్ల ఆశ్చర్యం) ఈ ఆంధ్ర రాష్ట్రం ఎట్లా ఉండబోతుంది? మనలో కమ్యూనిజం జాడ్యం వ్యాపించినట్టుగా ఇంకే రాష్ట్రంలోనూ వ్యాపించలేదు. ఆంధ్రరాష్ట్రం వచ్చాక మనం మన రాష్ట్రాన్ని చూసి సిగ్గుపడి తలవంచుకోవలసి వస్తుంది. మన రాష్ట్రంలో అరాచకంతప్ప ఉండదు. మనకన్నా కమ్యూనిస్టుల ఉధృతం జాస్తిగా ఉన్న బెంగాలు చూడండి. అక్కడి రాజకీయాలు చూడండి. సిగ్గు, సిగ్గు! ఎంతకాలమైతే మనమీ కమ్యూనిస్టు పీడను, ఈ హంతకులను, ఈ హింసావాదులను వదలించుకోలేమో అంతదాకా మనం ఆంధ్రరాష్ట్రం అడగనేరాం. నిజం పడితే. ఈ పీడ వదిలించుకుని మనం సవినయంగా సర్దార్జీ దగ్గిరికిపోయి, 'అయ్యా, సర్దార్జీ మేం మా రాష్ట్రాన్ని కమ్యూనిస్టు రహితం చేశాం. మాకు దయచేసి ఆంధ్రరాష్ట్రం ఇప్పించండీ', అంటే మద్రాసుతో సహా వస్తుంది. రాక ఎక్కడికి పోతుంది? మద్రాసూ, [illegible] వస్తుంది—మనలో [illegible] లేకుండా ఉంటే... ఇదుగో, [illegible] [illegible] కండి..."

ఇదంతా రాజకీయ గాంధీజం.

సాహిత్య గాంధీజం అది ఇంకో మోస్తరుగా ఉంటుంది. బ్రాహ్మణార్థం చేసే వాళ్ళకి కొడ్డీ సంభావనలూ, సన్మానాలూ, పెద్దిన బ్రాహ్మణార్థాలూ లేకపోతే ఎంతబాధో సాహిత్యపరులకు ఉపన్యాసా లిచ్చే అవకాశాలు లేకపోతే అంత బాధ. కొత్తగా [illegible] సమయంలో ఏబట్టలొట్టు గుమాస్తాల సంఘంవాళ్లు మీటింగులు చేసి పిలిచినా మన సాహిత్యపరుడు మాట్లాడటానికి ఒప్పుకుంటాడు

సాహిత్య ఉపన్యాసాలలో విశేషమేమంటే, ప్రతిక్షణమూ ఉపన్యాసకుడు—రంగస్థలంమీది నటుడులాగా—సదస్యుల దృష్టి తన మీదికే తిప్పుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఈప్రయత్నం వెనకటిరోజుల్లో గోప్యంగా ఉండేది. ఇప్పుడు కట్టుతెగింది.

"నన్ను మాట్లాడమన్నారు. ఇక్ష్వాకుల్ని గురించి మాట్లాడమన్నారు. ఇక్ష్వాకుల్ని గురించి మాట్లాడడానికి నేను తప్ప ఆంధ్రదేశంలో ఎవరున్నారూ? బెంగాలీవాళ్లల్లో ఏమన్నా ఉన్నా

లేమో, మహారాష్ట్రీల్లో ఏమన్నా ఉన్నా లేమో నే చూళ్లేదు. నాకు తెలీదు. తెలుగు వాళ్లలో లేరు. నాకు తెలుసు. 'ఇ-క్ష్వా-కు' అంటే ఏమిటి? మీ వెధవ మొహాల్లో ఒక్కడూ చెప్పలేదు రాసిస్తా. కావలిస్తే స్టాంపుమీద రాసి రిజిస్టరు చేసిస్తా... ఏమిటి సెలవిస్తారూ? నన్ను చెప్పమనా? నే చెప్పను. చెబితే మీ కర్థంకాదు కనకా! కూర్చోండి."

ఉపన్యాసం ఇంకా సరిగా గాట్లో పడక ముందే ఉపన్యాసకుడికి చాలా సందేహాలు వస్తాయి. ఈ కుంకలు నేను ఎంత గొప్పవాణ్ణో ఇప్పటికన్నా గ్రహించారా? గ్రహించినట్టు లేదే! పనిలోపని, వీళ్ళకు పెద్దవాళ్ళ సమక్షంలో ఎట్లా ప్రవర్తించాలో ఇప్పుడే నేర్పెయ్యకూడదూ? వాడెవడో సిగరెట్టు అంటించాడు! నేను మాట్లాడుతున్న ఈ సభమీద తనకు గౌరవం లేదని సూచించడానికేనా? ఆ కుంకలు నవ్వుకుంటున్నారు! నన్ను చూసేనా? అమూల నలుగురు చేరి వేరే సభ పెట్టారే!

"దీన్ని సభ అంటారు. సభలో కూచునే వాళ్లకి సభ్యత తెలియాలి. ఇది క్లబ్బనుకున్నారో, ఎన్నికల మీటింగనుకున్నారో నాకు తెలియడం లేదు. సిగరెట్లు కాలుస్తూ, మాట్లాడుకునే వాళ్లు తక్షణం లేచిపోండి." (సభలో కొంచెం కోలాహలం.)

సభ ఏర్పాటు చేసినవారు వచ్చి ఉపన్యాసాన్ని శ్రద్ధగా ఆలకించవలసిందని సద్దు చేయవద్దనీ సభ్యులకు విన్నవించుకుంటారు. ఆ తరవాత ఉపన్యాసం సాగుతుంది. ఇక్ష్వాకులకు సంబంధించిన ఉపన్యాసంలో ఈ కింది మహత్తర విషయాలు మనకు తెలుస్తాయి:

"మనం బానిసత్వంలో ఉండి మరీ ముందుకు వచ్చాం. ఇప్పుడు మనకు వెనక్కి తిరిగిపోయే స్వాతంత్ర్యం వచ్చింది. మనం ఇక్ష్వాకులనాటికి పోవాలి. అక్కడ ఆగాలి. ఈ రైళ్లూ, ఈ విమానాలూ, ఈ గడియారాలూ ధర్మాన్ని నాశనం చేశాయి. ఎందుకివి? టైమెంత అయిందో ప్రతిక్షణమూ చూసుకోవాలా? మనం గడియారం చూడకపోతే కాలం జరగదా? జీవితమంటే ఏమిటి? పుట్టటమూ, పెరగటమూ, చావటమూ- ఇంతేగా? ఈ భాగ్యానికి రైళ్లెందుకు? గడియారా లెందుకు? యథార్థ జ్ఞానం బ్రహ్మజ్ఞానం. అది సంపాదించడానికి విమానా లెందుకు? శాస్త్రపరిశోధన లెందుకు? మన ఋషీశ్వరులు ఇళ్లూ వాకిళ్లూ కూడా వర్జించారే. మనకి ఆరాటాలూ, తాపత్రయాలూ, యుద్ధాలూ దేనికి?

"స్వరాజ్యం కావాలి, కావాలి, అన్నారు. వచ్చింది! తృప్తి అయిందా? ఏం వొరిగింది? జీవితం ఏ విధంగా బాగుపడింది? మరింత ఛండాలమయింది. స్వభాషా, స్వసంస్కృతీ నిజమైనవి. అవి పోగొట్టుకున్నాం. అవి సంపాదించాలి. అంతేగాని స్వరాజ్యం దేనికి దిక్కుమాలిన రాజ్యం. నిన్ను నువు నిగ్రహించుకో లేవు గాని రాజ్యాధికారంతో అందర్నీ నిగ్రహిస్తావూ? దేనికి? ఏం సాధించటానికి? అందర్నీ తపస్వులను చేస్తావా చెయ్యి! కృతయుగం తెస్తావా? తీసుకురా? రామరాజ్యం నిలబెడతావా? నిలబెట్టు! లేకపోతే ఈ ఆర్భాటమంతా కట్టిపెట్టు!... స్వాతంత్ర్యం వచ్చిందిట, స్వాతంత్ర్యం! నీనోట మాట్లాడే భాష నీదేనా? నీ నెత్తిమీది జుట్టు నీదేనా? నువు కట్టిన కట్టు నీదేనా? ఏంస్వాతంత్ర్యం వచ్చింది నీకు?... లేదూ, కమ్యూనిజమని గంతులేస్తావు. తుపాకీ తీసుకుని అందర్నీ కాల్చటమేగా కమ్యూనిజమంటే? రష్యా చెప్పినట్లు వినటమేగా నీ మతం! ఇదేనా స్వరాజ్యం?..."




## 7

ఒకరోజు మధ్యాహ్నం రామదాసు ట్రిప్లికేను వెళ్ళివచ్చి నరసింహాంతో తాను వెళ్ళిపోతున్నాననీ, యిక బహుశా తిరిగిరాననీ చెప్పాడు.

ఆ వేళ ప్రొద్దుటే సరోజ మిషనరీస్కూలు నుంచి వచ్చేసిందనీ, వాళ్ళ మేనత్త దగ్గర వుంటోందనీ రామదాసు తెలుసుకున్నాడు. ఆ సంగతి వినగానే నిజంగా దాసుకి మతి చలించి నట్టయింది. అతని కిప్పుడు ఒకటే ఆలోచన—ఆమె వుంటున్నయింట్లోనే ఎలాగో ఆశ్రయం సంపాదించి తను ఎవరిక్షేమంగురించి తాపత్రయ పడుతున్నాడో ఆమె సాన్నిధ్యంలో నిత్యమూ వుండాలని అతనివాంఛ.

అతను ఆలోచించాడు, ఎత్తులువేశాడు. చివరికి సుబ్బారాయుడు శాసనసభా సభ్యుడయిన సంగతిజ్ఞాపకం వచ్చింది. సుబ్బారాయుడి కిప్పుడు కార్యదర్శి కావాలన్న సంగతికూడా దాసు తెలుసుకున్నాడు. వెంటనే అతను సుబ్బారాయుడి అంతరంగిక కార్యదర్శి అవటానికి నిశ్చయించుకున్నాడు. తాను పూర్వం పనిచేసిన సిఫుంటుకార్యాలయ సంపాదకుని దగ్గరకు వెళ్ళి ఒక సిఫారసు ఉత్తరం తెచ్చుకున్నాడు. ఆ సంపాదకుడు దాసుమీద ప్రేమచేత సుబ్బారాయుడితో ముఖస్తంగాకూడా అతనినిగురించి చెబుతానన్నాడు. దాసు సుబ్బారాయుణ్ణి వెళ్ళి కలుసుకోవాలి; అంతే ఆలస్యం, ఉద్యోగం తప్పకుండా అవుతుంది.

నరసింహాం దాసు వెళ్ళిపోతానంటే బాధ పడ్డాడు; చాలా ఆశ్చర్యం చెందాడు; నోట మాటరాక దాసుకేసి కొంతసేపు నిర్ఘాంతపోయి చూశాడు. చివరికి యిలా అన్నాడు: "కాని మనం యింత అకస్మాత్తుగా విడిపోవటానికి వీలులేదు. మనకి కొన్ని సంవత్సరాలవరకూ చెయ్యవలసినపని చేతిలో వుంది. నేను నిన్నీపనిలో ప్రవేశపెట్టాను, నీ అవసరం నాకు చాలావుంది. అయినా నువ్వెక్కడికి కదతావు? ఏం చెయ్యదలచుకొన్నావు?"

"నేనొక శాసనసభ్యుడికి కార్యదర్శిని కాబోతున్నాను." అన్నాడు దాసు నెమ్మదిగా.

"శాసనసభా సభ్యుడికి కార్యదర్శివా" అని నవ్వి, "నువ్వు సరదాకి అంటున్నావేమో. నీకు త్వరలో లభించే మహాద్భాగ్యం వదిలిపెట్టి అటువంటి చిన్నపనికి నువ్వు వెడతావంటే నేను నమ్మను. బాగా ఆలోచించు. మనకి మాత్రం త్వరలోవిజయంతప్పదు." అన్నాడు నరసింహాం.

దాసు భుజాలు విదుల్చుకొన్నాడు నిర్లక్ష్యంగా: ఓ చిరునవ్వు నవ్వాడు. అతనికి పేరు ప్రతిష్ఠలు ఒక లెక్కలోవా? అతని ధ్యేయంతా సరోజ సౌఖ్యమేగా? ఆమెకోసం నిర్విచారంగా దేనినైనా వదులుకోగలడు. అతను కావాలనే అత్యల్ప పదవి కోరుకుంటున్నాడు. తన కప్పగించబడిన పిల్లను సదా కాపాడటమే అతనిలక్ష్యం.

"అయితే నీకు మన పరిశోధనలో పరిపూర్ణత సంపాదించాలని లేదన్నమాట." అన్నాడు నరసింహాం మళ్ళీ. "నేను పరిపూర్ణత సాధించవలసినది వేరేవుంది. అక్కడ పరిశోధనలు సాగించటానికే నిన్ను వదిలి వెడుతున్నది. నన్నేమీ ప్రశ్నలు అడగకు. నా పని పూర్తవగానే నేనొచ్చి నీకంతా చెబుతాను. నాకోసంమాత్రం నువ్వు విచారించకు. నేను చాలాసుఖంగా వున్నాను. ఈ పన్నెండేళ్ళబట్టీ దేనికోసమైతే నేను ఎదురుచూస్తున్నానో ఆఅవకాశం యిన్నా

తృప్తి నాకు లభించింది. నన్ను నువ్వు బాగా ఎరుగుదువు. నేను తెలివితక్కువ పని చెయ్యటానికీ, సిగ్గుపడవలసిన పని చెయ్యటానికీకూడా సమర్థుణ్ణి కానని నువ్వు ఎరుగుదువు కాబట్టి నా గురించి తాపత్రయపడకు. నన్ను బాగా అర్థంచేసుకో. నే నిప్పుడు చాలా ఆనందంగా వున్నాను. నా జీవితంలో నెరవేర్చవలసిన పని పూర్తి అయే సమయం ఆసన్నమయింది.''

నరసింహం దాసు చెయ్యిపట్టుకుని వాత్సల్యంతో నిమిరాడు. అతనికి దాసు ఆత్రుత, సంతోషం చూస్తే వాళ్ళు విడిపోవటం ఎంతో ముఖ్యంగా కనిపించింది. దాసు ఏదో తన జీవిత లక్ష్యం కోసమే అతనికి త్వరలో కలుగబోయే మహాద్భాగ్యాన్ని త్యాగంచేస్తున్నాడని అతను గ్రహించాడు.

మరునాడు రామదాసు అతన్ని వదిలి వెళ్ళిపోయాడు. రాత్రంతా సామాను సర్దుకోవటంలోనే గడిపాడు. అతని హృదయం చాలా వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. అతను ఆశానిరాశలమధ్య అల్లాడుతూ పన్నెండు సంవత్సరాలు ఆ నాలుగు గోడలమధ్యా గడిపాడు. అటువంటివాడు ఆ స్థలాన్ని వదిలివెళ్ళాలంటే చాలావిచారంగా వుంటుంది. దారిలో వెడుతూ నరసింహాన్ని ఆఖరిగా ఇలా అన్నాడు.

''వీలయితే నేను మళ్ళీవచ్చి నిన్ను కలుసుకుంటాను. నా గురించి నిరాశ చెందకు. నీ పరిశోధన సాధించి యిద్దరి ఫలితాన్నీ నువ్వేపొందు'' అని వెళ్ళిపోయాడు, త్వర త్వరగా. నరసింహం తనవెంట రావాలనే ఉద్దేశం అతనికి లేదు.

దారిపొడుగునా ఆలోచిస్తూ ఏ దారిన వెడుతున్నాడోకూడా తెలియకుండానే జార్జిటవును చేరుకున్నాడు. భూతభవిష్యత్తులు అతని మెదడులో తిరుగుతున్నాయి. రాజేశ్వరమ్మ చనిపోవటం మళ్లీ కనిపించింది. ఆ నాటినుంచి అప్పటివరకూ జరిగిన సంగతులన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. ఇప్పటినుంచి యికముందు జరగవలసిన కార్యక్రమంకూడా ఊహాపథంలో తిరిగింది.

అతని ఆలోచనల్లో అత్యధిక స్థానాన్ని ఆక్రమించుకున్నది సరోజ—సరోజ యీ నాటికీ పన్నెండేళ్ళక్రిందట వాళ్ళయింటి ఆవరణలో గడ్డిమీద ఆడుకునే చిన్నపిల్లలాగనే దాసుకు గోచరించింది. అతనికి ఆత్రుత, ఆవేశం ఎక్కువయాయి.

ఆ చిన్నపిల్ల తన ఆధీనం. ఆమెను, ఆమె తల్లి తనమీద నమ్మకంతో, ప్రేమతో, తనకు వారసత్వం యిచ్చినట్టుగా యిచ్చింది.

అటువంటి తన అధీనంలోని పిల్లను యిన్నాళ్ళుగా దొంగిలించి ఉంచుకోవటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆ విషయం తలుచుకొని అతను కలత చెందాడు; కాని త్వరలోనే తిరిగి ఆమె తన అధీనంలోకి వస్తుందని తెలుసుకుని శాంతించాడు. ఆమె తల్లిని తానెంత గాఢంగా ప్రేమించాడో ఆమెనుకూడా తను అంత గాఢంగా ప్రేమించాలి, దేవతగా ఆరాధించాలి అనుకున్నాడు. వింత వింత అభిప్రాయాలతో అతను తన్మయత్వం చెందాడు. ఆమెకోసం ఏ త్యాగమైనా జంకకుండా చెయ్యాలనే సంకల్పం అతని ప్రతి రక్తనాళంలోను ప్రవహించింది. అతనిలోని నిష్కల్మషప్రేమతో, ఆరాధనతో అతను ఉక్కిరి బిక్కిరయాడు. ఇన్ని సంవత్సరాలుగా అతనిలోని భావాలన్నిటినీ తొక్కిపెట్టివుంచాడు. ఇన్నాళ్ళూ అతను ఒక యంత్రంలాగ పనిచేశాడు; యిన్నాళ్ళూ శాంతంగా, చల్లగా వేచివున్నాడు. అతనిలో చైతన్యం కలిగింది-అది మహోత్కృష్టచైతన్యం. అతను సరోజను గురించి ఆలోచించినప్పుడల్లా ఆమెను ఆరాధించటమనే విషయం అతనికి దానంతటదే స్ఫురణకు వస్తోంది. ఇన్నాళ్లూ అతనిలో నిద్రాణమైవున్న కోర్కె శక్తి ఒక్కసారిగా మేల్కొని దృఢతరరూపం దాల్చింది. అందుకనే అతని నిశ్చితాభిప్రాయంలో జంకు గొంకులు లేవు.

అతను ఎలా ప్రవేశించాడో తెలియకుండానే సుబ్బరాయుడి గదిలోకి వెళ్ళాడు. ఒక జవాను వచ్చి ''దయచేసి కూర్చోండి. బాబుగారు యిప్పుడే వస్తారు'' అన్నాడు. దాసు మనస్సును కుదుట బరచుకునేందుకు ప్రయత్నిస్తూ కూర్చున్నాడు.

ఆ కొద్ది నిమిషాల వ్యవధీ అతనికి చాలా మేలు కలుగజేసింది. వెంటనే అతని కాబోయే యజమాని దర్శనం గనుక అయినట్టయితే మాటలు

తడబడి కంగారుపడేవాడు. అతను లేచి ఆ గదిలోవున్న పుస్తకాలనూ, బొమ్మలనూ, అలంకరణలనూ పరికించటం మొదలుపెట్టాడు. ఆ పరికరాలు, సామాను చాలా ఖరీదైనవే అయినా చాలా హీనస్థితిలో వున్నట్టుగా అతనికి కనపడ్డాయి. ఒక బల్లమీద పాలరాతి శిలావిగ్రహాన్నిచూసి ఏదో గంధర్వ స్త్రీ బొమ్మ అనుకున్నాడు. కాని నెమ్మదిగా పరిశీలించి ఆ బొమ్మ నెత్తిమీద టోపీ, జుట్టుకత్తిరించిన విధానం చూసి ఎవరో శృంగార స్త్రీ శిలా విగ్రహం అనుకున్నాడు.

ఆ బొమ్మ అక్కడికి ఎలా వచ్చిందా అని అతను ఆశ్చర్యపోయి చూస్తుండగా వెనకనించి చిన్న పొడిదగ్గు వినిపించింది.

సుబ్బారాయుడు ఆ గదిలోకి వచ్చాడు. ఆయన లావుగా నిండుగా వుంటాడు. విశాలమైన, కాంతిగల కళ్ళు. మాట్లాడేప్పుడు కుడి చేయిని తిప్పుతూ మాట్లాడటం అతనికి వ్యసనం.

రామదాసు తనెవరో, ఎందుకు వచ్చాడో ఆయనికి చెప్పాడు. "ఓహో, అలాగా, బాగుంది. నీగురించి విన్నానులే. మనిద్దరం ఒక అభిప్రాయానికి వస్తే మంచిదే. కూర్చో" అని సుబ్బారాయుడంటూ తనూ ఒక కుర్చీలో కూర్చున్నాడు.

సుబ్బారాయుడు మంచివాడనే చెప్పాలి. ఒక్కొక్కప్పుడు కొన్ని విషయాల్లో చాలా తెలివి తేటల్ని ప్రదర్శిస్తూ వుంటాడు. కొన్ని విషయాలమీద ఆయనకి కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయి. ఆ అభిప్రాయాలు ప్రపంచం తల్లక్రిందులైనా మార్పుకోడు. ఆయనకి యిష్టమైన విషయాలు మినహాయించి కొత్తవాటి గురించి మాట్లాడితే ఆ మెదడు పనిచెయ్యదు.

ఆయనదగ్గర ఒక్కటే దుర్గుణం వుంది—అది తను మహా గొప్ప రాజకీయవేత్త ననుకోవడం. రాజకీయాల్లో ఆయనకి కొన్ని మూఢవిశ్వాసాలు మైలు రాళ్ళలాగ వున్నాయి. పరిస్థితు లెంత మారినా ఆ నమ్మకాలు విడిచిపెట్టడు. ఆయన ఎన్నివూళ్ళు తిరిగి ఎక్కడ ఉపన్యాసాలిచ్చినా అన్నీ యించుమించు ఒకలాగే వుండేవి. ఈ గుణా లిలా ఉన్నప్పటికీ ఆయన చాలా నిశ్చితమైన మనిషి.

చిన్నప్పటినుంచీ "ప్రజలు - స్వేచ్ఛ" అనే నినాదాలు ఆయనికి చాలా యిష్టం. ఎప్పుడూ ఆ విషయాలమీదే మాట్లాడుతూ వుండేవాడు. కొన్నాళ్ళకి ఆయన చాలా ధనికుడై చాలామంది పనివాళ్ల చేతిలో వున్నా ఉపన్యాసాలిచ్చేవాడుగాని, తనకింద పనిచేసేవాళ్ళ పొట్టనింపి భూతదయ కనపరిచి మాటలకంటె చేతలలో ఎక్కువ కార్యసాధన చూపించవచ్చుననే విషయం గ్రహించలేదు. ఆయనమట్టుకి ప్రజలు- స్వేచ్ఛ అనేవి ఎన్నాళ్లయినా నిర్జీవంగా, నిర్థత్యంగా ప్రేమించే వస్తువులుగానే కనిపించేవి.

ఆయన చాలా డబ్బు పోగుచేశాక రాజకీయాలంటే అభిలాష ఎక్కువైంది. అతను శాసన సభాసభ్యు డవగలిగాడు. శాసనసభాభవనంలో ఉపన్యాసాలు, వాద ప్రతివాదాలు అతిశ్రద్ధగా వినేవాడు. శాసనసభ వాయిదాపడి యింటికి వచ్చినప్పుడల్లా తనమూలంగా దేశమంతా రక్షింపబడింది, లేకపోతే సర్వనాశనం అయిపోను అనుకునేవాడు. తనదృష్టిలో ఆయనకి అధిక్యం చాలా హెచ్చింది. అక్రమాన్ని, అన్యాయాన్ని రూపుమాపటానికి తనని మించినవాడు లేడనుకొనేవాడు. ఆయనకి ఒకటే చాలా ఆశ్చర్యంగా వుండేది—యింత త్యాగి, దేశ నాయకుడు, రాజకీయవేత్త వీధివెంబడి వెడుతూంటే అందరూ నమస్కరించి ఎందుకు జోహారు చెయ్యరో అతనికి అర్థమయేది కాదు.

ఆయన భార్య ఆయన శాసనసభలోకి వెళ్ళకుండా వుండాలని ఎంతో ప్రయత్నించింది. ఆమెకు ముస్తాబు, విలాసం బాగా యిష్టం. అందుకని ఆయన సంపాదన తగ్గటం ఆమె కిష్టం లేదు. సుబ్బారాయుడు మాత్రం పట్టుదల వదలలేదు. ఆమెకు పూర్తి స్వేచ్ఛ నిచ్చి ఆమె ఎలా అనందంగా వుంటే అలాగ నడుచుకోమన్నాడు. తనకి రాజకీయాల్లో ప్రవేశించటం మహానందం గాబట్టి, తనయిష్టానుసారం అలా చేశాడు. భర్త పట్టుదల చూసి ఆమెకి కోపం వచ్చింది; అందువల్ల యింకా ఎక్కువ విజృంభించి సౌందర్య మీద, అలంకారాలమీద సొమ్ము ఖర్చు చేయటం మొదలు పెట్టింది. ఆయన మాత్రం యీ పోకులు, యీ ఆడంబరాలు అసహ్యించుకొని నిరాడంబర జీవితం గడుపుతూ ప్రజల సేవ

సౌకర్యాలపైనే తన దృష్టిని కేంద్రీకరించే వాడు. భార్యాభర్తల నిద్దరినీ చాలా సునిశితంగా పరిశీలిస్తే వారిద్దరూ యించుమించు ఒకే రకం మనుష్యులని చెప్పొచ్చు.

సుబ్బారాయుడు శాసనసభా సభ్యుడైన దగ్గర్నుంచీ అతని కీర్తి కాంక్షకు అంతులేదు. అతనికిప్పుడు "గ్రంథకర్త" కావాలనే ఆశ వొకటి చాలా దృఢంగా వుంది. ఆర్థిక రాజకీయాల మీద ఒక ఉద్గ్రంథాన్ని వ్రాయ తలపెట్టాడు గాని, అది ఎలాగ వ్రాయాల్లో అతనికి అయోమయంగా వుంది. అందుకనే అత నొక కార్యదర్శికోసం ప్రయత్నించాడు.

రామదాసు చాలా ఉత్సాహం, నమ్రత కనబరిచాడు. సుబ్బారాయుడు విధించిన నిబంధనల కన్నిటికీ ఒప్పుకున్నాడు; కాని అతను షరతులు చెబుతున్నప్పుడు దాసు నిజంగా వినలేదు. అతని ఆతురతంతా ఆ యింట్లో ప్రవేశించటంగురించే వుంది. ఇద్దరూ ఏకమాట అనుకునే పరిస్థితికి వచ్చేటప్పటికి సుబ్బారాయు డిలా అన్నాడు.

"మన మిద్దరం ఒకేచోట వుండేవాళ్ళం కనక మనమధ్య భేదాభిప్రాయా లుండరాదు. నీ మనస్సుకి ఏ రాజకీయపంథా నచ్చితే అది అవలంబించవచ్చు. నన్ను బట్టి నీ అభిప్రాయాలు దిద్దుకోమని నేను కోరను. అయినా యింతకూ నీ రాజకీయాభిప్రాయా లేమిటి?"

"నా అభిప్రాయాలా!" అని ఆశ్చర్యపోయాడు దాసు. "నేను సంపూర్ణస్వేచ్ఛ నా కాంక్షిస్తాను. ప్రజల కంతకంటె కావలసినదేమిటి?" అన్నాడు దాసు అప్రయత్నంగానూ, పాలరాతి బొమ్మకేసి చూస్తూను.

ఆ బొమ్మను తీసి చేత్తోపట్టుకుని సుబ్బారాయుడు గంభీరంగా అన్నాడు- "యీ విగ్రహాన్ని చూశావా? ఈమె తల్లితో సమానం- స్వేచ్ఛామాత-దేశాన్ని పునఃసృష్టి చేయటమే యీమె పని."

దాసుకి ఆ మాట లేమీ అర్థంకాలేదు. ఆ చిన్న వస్తువును పట్టుకొని అంతంత పెద్దమాటలు వాడటం అతనికి నచ్చలేదు. సుబ్బారాయుడు ఆ బొమ్మను అల్లాగే పట్టుకుని పెద్ద పిల్లలు చిన్న పిల్లల ఆటవస్తువుల కేసి చూసినట్టు చూశాడు.

సుబ్బారాయుడి ముఖంలో కనిపించే లక్షణాలను పరీక్షిస్తూ కూర్చున్నాడు దాసు. అతను 'స్వేచ్ఛ' అని గొంతెత్తి అరచే నినాదం, ఉపన్యాసం యీ పాలరాతి శృంగారపు బొమ్మగా తప్ప మరోవిధంగా అతనికి తట్టటంలేదు. మరో విధంగా చెప్పాలిసొస్తే అతని 'స్వేచ్ఛ' జేబులో పెట్టుకొనిపోయేటంత సులభం.

సుబ్బారాయుడా విగ్రహాన్ని బల్లమీద పెట్టేసి వచ్చి కూర్చున్నాడు. అతను రామదాసుకి ఉద్యోగం యిచ్చాడు. అతను రాజకీయాల్లోని క్లిష్టసమస్యల గురించి చర్చించటం ప్రారంభించాడు. రామదాసు మాత్రం యింకా సిగ్గును, భయాన్ని ప్రకటిస్తున్నాడు.

సుబ్బారాయుడు దేశకాల పరిస్థితుల్ని తీవ్రంగా మహోపన్యాసంలో తెలుపుతూవుంటే ఆ పక్కగదిలోంచి వినబడిన నవ్వులు ఆకస్మాత్తుగా అతని ఉపన్యాసానికి అంతరాయం కలిగించాయి.

"మామయ్యా, మామయ్యా!" అని ఒక యువతి గొంతు వినిపించింది; వెంటనే తలుపులు తెరువబడ్డాయి.

పొడుగాటి అందమైన పిల్ల పెద్ద శబ్దంచేస్తూ ఆ గదిలో ప్రవేశించి సుబ్బారాయుడి వైపు పరుగెత్తింది. ఆమె చేతిలో వున్న పంజరంలోని రెండు చిలుకలను ఆయనకి చూపించింది. "చూడు మామయ్యా, చూడు. యీ రెండు చిలుకలూ ఎంత బాగున్నాయో! ఎర్రని ముక్కులూ, పసుపు పచ్చని రెక్కలూ, నెత్తిమీద నల్లని రంగూ- ఎంత బాగున్నాయో! నాకు ఒకళ్ళు యివి బహుమతి చేశారు మామయ్యా" అని నవ్వుతూ ఆ పంజరంలోని చిలుకలను యింకా పరీక్షగా చూస్తోంది. ఆమె ప్రతి విన్యాసంలోను విలాసాన్ని విరజిమ్ముతోంది.

ఆమె పొడుగ్గా వుందన్నమాటేగాని యింకా కుర్రతనం పోలేదు. ఆమె ఆ గదిలోని మాంద్యాన్ని, కార్యభారాన్ని పోగొట్టి వెలుగును, ఉత్సాహాన్ని తీసుకొచ్చింది. ఆమె కట్టుకున్న తెల్లచీర ఆ గదిలోని వెలుగును తెల్లని గోడల మీదకు ప్రసరించి కాంతిని ద్విగుణీకృతం చేసింది.

ఆమె ముఖం ఆనందంతో ఎర్రబారింది. చేతిలో పంజరం పట్టుకొని గది అంతటా తిరగటం మొదలు పెట్టింది. ఆమె తిరిగిన చోటల్లా మంచి అత్తరు సువాసనలు గుప్పుమనేవి. ఆమె విశాలమైన నుదురు, విశాలమైన కళ్లు, అమాయకతతో కూడిన ఆనందం ఆమెకి చాలా అందాన్ని కూర్చాయి.

ఆమె సరోజ—దాసు ఎదురుచూస్తున్న సరోజ. దాసు ఒకవిధమైన భయంతో, మర్యాదతోను ఆమెకేసి చూస్తూ లేచి నిలబడ్డాడు. ఆమె యింత పెద్దదవుతుందని అతనెప్పుడూ వూహించలేదు. ఆమె యింకా పొట్టిగా, చిన్నపిల్లలాగే వుంటుందనీ, ఆమె నెత్తుకుందుకు తను వంగ వలసివస్తుందనీ అత ననుకున్నాడు.

ఇప్పుడు పొడుగ్గా, అందంగా యౌవనంతో వున్న పిల్ల ఆమె. అతని నిదివరకు వెక్కిరించి, హేళనచేసిన అందరు యువతుల్లాగే కనిపించింది ఆమెకూడా. ఆమె అతనికేసి చూస్తుందనే విషయం స్ఫురణకు రాగానే అతని ఉత్సాహం చచ్చిపోయింది.

అతనికి అప్పగించబడిన చిన్నపిల్ల స్థానంలో మరో పెద్ద పిల్లను వుంచినట్టుగా భావించాడు. అతను చిన్నపిల్లను కోరాడుగాని, యింత పెరిగిన యువతిని కాదు. ఇంత హుషారుగా, యింత నిర్లక్ష్యంగా వుండే పిల్లతో మాట్లాడటంకూడా అతనికి జంకే. ఆశ్చర్యంలో తను ఏం చేస్తున్నదీకూడా అతనికి తెలియలేదు. ఆమె తల్లి చనిపోయేటప్పుడు ఏం చెప్పిందో అతను జ్ఞప్తికి తెచ్చుకోలేదు. చేతులుకట్టుకొని ఆగదిలో ఒకమూల నిలుచున్నాడు. అతనికి ఎంతభయంగా వున్నప్పటికీ తన దృష్టినిమాత్రం ఆమెమీదనుంచి మరల్చలేక పోతున్నాడు, ఆమెకు తల్లిపోలిక ఏ మాత్రం వుందో పరీక్షిస్తూ.

సరోజ వాళ్ల మామయ్య అనే మాటలు వింటూ అతని కేసైనా చూడలేదు. సుబ్బారాయుడికి అంతరాయం కలిగించినందుకు కోపం వచ్చిందామెమీద. తీక్ష్ణంగా చూశాడు. అతని ఆలోచనల కంతరాయం కల్గించే ఆ పిల్లచేష్టలు అతనికి నచ్చవు.

"బాగుంది; నువ్వు సుడిగాలిలా వచ్చావు. నువ్వింకా బడిలో చదువుకొనే చిన్నపిల్ల ననుకుంటున్నావేమో. నీ పద్ధతు లింక మార్చుకోవాలి."

సరోజకి ఆ మాటలు పౌరుషం కలిగించాయి. ముఖం తీక్ష్ణంగా పెట్టి, అతికష్టంమీద ఓనవ్వు నవ్వ గలిగింది. ఆమె ఏదో మనస్సులో అణచుకుంటున్నట్టుగా కనపడింది. ఆమె తీవ్రమైన



చూపుల్లో వాళ్ళ మామయ్య చేసిన తప్పంతా ప్రతిబింబించింది; ఆమె కెరలిగా నవ్విన నవ్వులో అతను ఆమెపై అమలుజరిపే అదుపాజ్ఞలమీద నిర్లక్ష్యత కనబరిచింది.

"పైగా నేను, చూడు, ఒకాయనతో మాట్లాడుతున్నాను" అన్నాడు తాజాగా సుబ్బారాయుడు.

సరోజ తిరిగిచూసింది ఆ మాట్లాడే వ్యక్తి ఎవరోనని. ఒకమూల రామదాసు కనిపించాడు. ఒకటి రెండు క్షణాలు ఆశ్చర్యంగా చూసి నిరుత్సాహం చెందింది. ఆమె వాళ్ళస్కూల్లో క్రైస్తవ మత బోధకుల పటాలు, ఆవీ దగ్గరగా వెళ్ళి చూసేది; యిప్పుడా మూలనిలబడ్డ యువకుడు కూడా సాధారణపు దుస్తులు ధరించి, ఉత్సాహం నశించి అన్నీ భగవదర్పణ చేసిన ఆ క్రైస్తవ సన్యాసుల్ని జ్ఞాపకం చేస్తున్నాడు.

రామదాసు ఆమె తనకేసి తిరిగినప్పుడు కళ్ళు కిందికి దించేశాడు. అతను సిగ్గుపడ్డాడు. తన పరిస్థితి తనకే అసహ్యంగా తోచింది. ఇన్నాళ్ళు ఎదురు చూస్తున్న యీ సమావేశం యింత బాధాకరంగా వుంటుందని అతను ఎప్పుడూ అనుకోలేదు. ఆ భవనంలోకి రాకముందు రోడ్డుమీద నడుస్తూ అతను ఆమెను కలుసుకోగానే చేతుల్లోకి తీసుకుని ఎత్తుకుందా మనుకొన్న ఆలోచన స్ఫురణకు వచ్చింది. ఇప్పు డతను ఆమెముందు వణుకుతూ నిలబడ్డాడు; ఒక్క మాటైనా అతని నోటి నుంచి వెలువడలేదు.

ఏదో అంతర్లీనమైన శక్తి అతనిని ఆమెవైపు నెట్టినట్టుగా అతనికి తోచింది. కొన్ని క్షణాల తర్వాత ఆమెవైపు ముందుకు సాగుదామని అనుకున్నాడు. అత నెక్కడ వున్నాడో, సుబ్బారాయుడి సమక్షం-వీటినిగురించి అత నాలోచించనే లేదు. ఆమెవైపు రెండడుగులు వేశాడు. ఆమె అతన్ని గుర్తించలేదని దాసు నిర్ధారణ చేసుకున్నాడు. ఆమె మూతి ముడుచుకోవటం చూసి అతను నిరాశ చెందాడు; అతని హృదయం బరువెక్కింది. ఆమె అతన్ని ప్రేమించలేదు - ఆమె ఎన్నటికీ ప్రేమించదు. ఆమెకు తను తండ్రిగా, రక్షకుడుగా వుండలేదు. ఆమె ఎన్నటికీ అతని కుమార్తెగా, సంరక్షింపబడే దానిలా వుండబోదు.

అతనలా ఆలోచిస్తూండగా సరోజ ముందుకు వచ్చి పంజరం తీసుకొని వాళ్ళ మామయ్యతో ఒక్కమాటైనా అనకుండా వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోగానే సుబ్బారాయుడు: "చూడు, మన మెక్కడున్నామంటే. సంక్షోభావంయొక్క సిద్ధాంతీకరణ సూత్రంలో వున్నాం. ఇద్దరు కూలివాళ్ళను తీసుకో..."



# ప్రపంచశాంతి : "బృహస్పతి"

యస్. యస్. నారాయణ

సెప్టెంబరు 30 వ తే॥ "తెలుగు స్వతంత్ర" సంచికలో "బృహస్పతి" గారు "ప్రపంచ శాంతి" అను శీర్షిక క్రింద వెల్లడించిన అభిప్రాయాలు వివేకవంతులకు విషప్రాయములుగా తోచక మానవు.

విజ్ఞాన సింధువును మథించి సమాజంలో ఏర్పడెడి సర్వరోగములకు భౌతికవాదం చింతామణి వంటిదని సెలవిచ్చిన (శ్రీమతి లక్ష్మీ శివరావుగారికిచ్చిన సమాధానంలో) వారు అర్థం లేని రాతలతో పేజీలను నింపే వృత్తిని ఇంకా విరమించుకున్నట్లు తోచదు.

ఈ సందర్భంలో మానవజాతిని శాశ్వతంగా నడిపేది భౌతికవాదం కాని, హింసావాదం కాని కాదనీ ఆత్మశక్తి అనీ వారు గుర్తించుట అవసరం. (వారి దృష్టిలో అసలు ఆత్మశక్తి అనేది ఉన్నదో, లేదో!) వారు పారాయణ చేసిన (మెటీరియలిజాన్ని గురించి) ఏ ఉద్గ్రంథంలోకూడా ఆత్మశక్తిని గురించి ఒక్క ముక్క

అయినా లేకపోవడం, ఆత్మశక్తి అంటే ఆధ్యాత్మిక వాదులచే పరిమితార్థంలో బంధింపబడిన ఆధ్యాత్మిక విశ్వాసాలని వ్యాఖ్యానించుకోడం ఈ బుద్ధి జాడ్యానికి దోహదం ఇచ్చివుండవచ్చును. శ్రామిక విప్లవాన్ని అభినందించడానికీ, ఆధునిక విజ్ఞానాన్ని జీర్ణం చేసుకోడానికి ముందు భౌతిక వాదంలో పట్టభద్రులగుట అవసరమని వారి తలంపేమో!

తమ ఆదర్శములే పరమోత్కృష్టము లనుకొని అర్ధనిమీలిత నేత్రాలతో వానిచుట్టూ నిర్విరామంగా పరిభ్రమించే మానవగ్రహాలకు వివేకంగల లోకం ఏనాడో వాటిని మూఢవిశ్వాసములని త్రోసిపుచ్చి ముందుకు పురోగమించిన విషయం తెలియకపోవుటలో ఆశ్చర్యం లేదు. మానవుని ఆత్మకు అట్టిపరిణామము నొందగల శక్తి కలదనుటలోనే మనకు నమ్మకం లేకపోయె, మరి!

భౌతిక వాదమే ప్రపంచానికి శ్రీరామ రక్ష అని విశ్వసించి (మానవత్వాన్ని భౌతికవాదం రక్షించలేదని ఏనాడో రుజువైంది) మానవత్వపు టుత్తమాదర్శములన్నియు హేతువాదమునకు నిలువజాలవని తృణీకరించుటయే నేటి మానవుడు ఏ విధానమును కూడ స్వీయాభివృద్ధి కనుకూలముగ వినియోగించుకోలేక దిక్కులు చూచెడి పరిస్థితికి దిగజారుటకు కారణమై యున్నది. విధానములకు దాసులై విభిన్న మనస్తత్వాలను మానవ శ్రేయస్సు దృష్ట్యా అర్థము చేసుకో గల్గినంత సంస్కారము లేనివారు, సమాజము వ్యక్తి వలెగాక సర్వతోముఖాభివృద్ధి పొందవలసినదని గుర్తింపలేక తమ నమ్మకములే పరమోత్కృష్టములని గ్రహింపుడన్నట్లు వానినే సమాజాని నెత్తిన-అదీ హింసాయుతంగా - రుద్ద చూచిన వారు చరిత్రలో నేటివరకు సంభవించిన సర్వానర్థములకు మూలకారకులై యున్నారు. స్థిమితంగా ఆలోచించిన మానవుని ప్రకృతి సిద్ధంగా సంక్రమించిన పశు ప్రవృత్తులకు, జీవించవలెననెడి వాని బలీయమైన అస్తిత్వ వాంఛకు జరుగు ప్రబల పోరాటమే చరిత్రయని తోచకమానదు.

చక్రవర్తులు, జమీందారులు అభ్యుదయ నిరోధకులని చెప్పి ప్రజాస్వామ్యం, ప్రజాప్రాతినిధ్యం అను మోసపుమాటలతో మానవజాతికి (ధనమే సర్వస్వము అనుకొనువారును, అల్పసంస్కారులును, నిరక్షరకుక్షులును, అవినీతిపరులును అగు) వేలకొలది నాయకుల నంటగట్టి ఏరు దాటి తెప్పను తగలేసినట్లు—ప్రజాశ్రేయస్సునకు స్వస్తిచెప్పి మానవజాతి మనుగడకే ప్రమాదకరంగా పరిణమించిన నాయకలోకంగాక "ఒక విధమైన ధర్మమే" (మానవు డతిక్రమింపలేనంత శక్తిగల ధర్మమా అది?) యుద్ధములకు దారి తీయునని సెలవిచ్చుటలో ఎట్టి తాత్విక దృష్టి ఇమిడియున్నదో గోచరమగుట లేదు. ప్రకృతి శక్తులను ప్రజాశ్రేయస్సునకు వినియోగించుటకు బదులు ఆటంబాంబులను తయారుచేసి నరమేధ యాగాలు చేయుటకు నేడు కొన్ని దేశము లుద్యుక్తములగుట ఆయాదేశముల ప్రజలకోర్కె మీదటనే అని 'బృహస్పతి' గారు అనరుగద! మతోద్రేకము బుర్రల కెగదట్టి ప్రపంచాన్ని యుద్ధ వాతావరణంలో ముంచితేల్చిన ఒకనాటి మత తత్వవాదులు, సర్వవిధముల ఆదర్శచ్యుతులైన నేటి రాజకీయ వాదులు ఆటవిక దశలోని మానవునికంటె నైతికంగా ఎట్లు అగ్రగణ్యులో శ్రీవారికే ఎరుక!

"స్వస్తతాడనాద్దంతభంగః" అన్నట్లు డాక్టర్ రాధాకృష్ణగారు "ఒక విధమైన" రాజకీయ స్వాతంత్ర్యాన్ని ప్రస్తావించగా మరో రకపు పారవశ్యాలనుమాని నాటి నెమరుకొనుటలో (పాఠకులు యింతేమి లన్నట్లు) సత్యమును ఖూనీ చేయుట ధర్మము తప్ప మరే ధర్మమూ గోచరించుట లేదు. "విషిన్స్కీ లబలబలు, స్టాలిన్ సెలవియ్యడాలూ" మాత్రమే శాంతిప్రచారకులకు నిర్దేశింపబడిన నిర్దుష్ట పద్ధతులని విశ్వసించే వారికి రాధాకృష్ణవాణిలోని అంతరార్థం గోచరింపకపోవుటలో (భిన్నత్వంలో ఏకత్వం) అబ్బురం లేదు.

స్కెచ్

# సుజ్ఞానం - సుశీ

సులోచన

ఒక్కసారిగా- పదిమంది ఒక్కచోట గుమిగూడటం సుశీని కలవరపెట్టింది. కమ్మని సంగీతం- 'సురయ' పాడే పాటను వదలి రావాలంటే మామూలుగా కష్టమనిపించేది. వయస్సు చిన్నదైనా సంగీతం మీద అభిలాష అధికం. అదే సుశీలో వున్న విశేషం. ఆ కాలవకట్ట మీద పదిమంది ఆదుర్దాలతో చూడటం, చూడాలనే కౌతుకంకొద్ది ఆత్రుతతో పరుగెత్తే జనాన్ని చూస్తోంటే, సురయ రికార్డు మీద చిరాకేసి, 'ఎక్కడికే సుశీ' అని అమ్మ పిలుస్తోన్నా వెళ్ళి అక్కడ- ఆ కాలవ కట్ట మీద వాలింది.

తల తిరిగింది. కళ్ళను గట్టిగా, రెండు చేతులతో మూసుకుంది. ఇంతవరకు ఈ పదకొండు వత్సరాల జీవితంలో యిలాంటి దృశ్యం... కనీసం ఆలోచింపైనా వుండలేగా. తనుకద్దు అవస్థ అక్కడున్న పదిమంది ముఖాల్లో గోచరిస్తుందేమోనని చూసింది. కాని అలాంటి ఆందోళనచ్ఛాయలేవీ వున్నట్టు గోచరించలేదు. ఒకటిమటుకు అనుకుంది: ఇటువంటి దృశ్యాలు వాళ్ళకు కొత్తకావనిన్నీ, చూడటం వల్ల భయం లేదనిన్నీ. ఆ బాలిక హృదయంలో మటుకు పది సంవత్సరాలపాటు మరుపురాని దృశ్యం. మళ్ళీమళ్ళీ మనస్సులో చిత్రించుకొంటూ వెనక్కు తిరిగింది. రెండు గజాలదూరం వచ్చాక మళ్ళీ చూద్దామనే ఉత్సుకత ఏర్పడింది. ఆ జననంలోని విచిత్రత ఎంత. తన వయస్సెంతనే విచక్షణాజ్ఞానం నశించి- ఎలాగో పందుచేసుకొని వెళ్ళింది. కొంచెం నిదానంగా రెండు నిమిషాలు పట్టి చూసింది. తెల్లగా పాలిపోయి, కొంచెంగా ఎరుపెక్కి, చెత్తలో చుట్టబడిన ఆ పసికందును మళ్ళా చూడాలనే వాంఛ యింటికి చేరేలోపుగా కలగలేదు.

నాన్న నడిగింది- 'ఎవరు చేశారు నాన్నా, ఆదారుణకృత్యాం?'

'ఎవరేమిటి, చిన్నదానివి కనక యిటువంటి దృశ్యాలు ఎన్నడూ చూసుండకపోవచ్చు. మాకు అవి కొత్తవా! ఎన్ని జరుగుతూ వుండటంలేదు. వాటినిగురించి అంటే పట్టించుకోం గనక సరిపోతుందిగాని విచారిస్తే ఎన్నని విచారించం?'

నాన్నమాటలు ఆ అమ్మాయిని తృప్తిపరచలేకపోయాయి. మళ్ళా అన్నది-'బంగారంలాంటి పిల్ల పుడితే కాలవపాలుచేసే తెలివి తక్కువ తల్లి ఎవరుంటుంది నాన్నా!'

'ఎందుకుండదు తల్లీ? చాలామంది వుంటారు. మంది అంటే అందరూ ఎందుకు పారేసుకుంటారులే- ఎవరో చెడిపోయిన వాళ్ళు.'

నాన్న అనే మాటల్లోని ఆంతర్యాన్ని ఆకళింపు చేసుకొనే పరిపక్వత నిజంగా సుశీకి లేదు. కాని తెలుసుకోవాలనే పాళి. పై పైన చెప్పి కళ్ళే తండ్రిమాటల్లో అనుగుణుక్కి అనేక సందేహాలు జనించటంకద్దు. వాటన్నిటినీ తీర్చుకోవాలనే ఆశవున్నా, తండ్రి విసుగు చెందుతాడేమో అన్న గ్రాహకాలకీ మనస్సుకు జవాబుచెప్పుకొంటూ వుంటుంది. కాని నాన్న అనే మాటల్లో ఒక సందేహం బలంగా కలిగింది. వెంటనే అడిగేసింది.

'నాన్నా! చెడిపోయిన వాళ్ళంటే ఎవరు?'

నిజంగా ఆ ప్రశ్నకర్థం చిన్న పిల్లలకు అనౌచిత్యం. తండ్రికి కొంచెం కోపం వచ్చింది. వాళ్ళకి అప్పుడే యిటువంటి విషయాల్నిగురించి చెపితే యిబ్బందులు పడతారనే ఊహాకూడా కలిగి అన్నాడు —— 'అవన్నీ నీ కనవసరం. వెళ్ళి ఆడుకో.'

ఆ బుల్లిముఖం మాంగల్య విహీనమైంది. ఒక రకంగావచ్చిన కోపం వచ్చినట్టుగానే పోయింది. ఆలోచించింది. సుజ్ఞానానికి అలవాటుపడని ఆ

బుర్రలో 'చెడిపోయిన వాళ్ళకి నిర్వచనం లేదు. చివరకు ఒకటిమాత్రం నిశ్చయించుకొంది. 'బిచ్చగాళ్లయుంటారు. సహజంగా వాళ్ళలో పిల్లలు పుడితే తిండిపెట్టలేక పారేసుకుంటారు. తప్పకుండా వాళ్లే అయుంటారు.' ఆనిశ్చయంలో పూర్తి నమ్మకం చిక్కలేదు. సందేహాన్ని నివృత్తి చేసుకోవాలనే లాలస ఆటల్లో లేక పోయింది. ఆసాయంత్రం సంగీతం వినలేదు సరిగదా ఆటల్లో పాల్గొనలేదు. కథ పూడుస్తున్న అమ్మ నడిగింది- 'చెడిపోయిన వాళ్ళంటే ఎవరమ్మా!' అని గోముగా. అమ్మ కోప్పడింది. 'వాళ్ళతో నీకేం అవసరం, చక్కా చదువుకోక.' తక్కిన పేనులాగ వెళ్ళింది. పాపం! అమాయిక.

రాత్రి - 'నాన్నా, నాన్నా'- ఒక్కమాటడుగుతాగాని చెపుతావా?' అన్నది.

'అడుగు, చెపుతాను.'

'చెప్పకపోతే,' అనుమానం వేసింది. పొద్దున చెప్పలేదు గాబట్టి యిప్పుడుకూడా చెప్పదని.

'తప్పక చెబుతా, చెప్పకుంటే అప్పుడను.'

ఆ మాటలో సుశీకి పూర్తి నమ్మకమే కాకండా సందేహం నివృత్తి చేసుకోటానికి అవకాశం కల్పించింది.

'చెడిపోయినవాళ్ళంటే ఎవరు నాన్నా!'

ఆ ప్రశ్నకు ఒక్కనవ్వు నవ్వుకున్నాడు. అబద్ధం చెప్పి అడిగించుకోకండా చేయటమే మంచి దనుకొన్నాడు. ఒక విధంగా చెప్పినా అర్థమవనే నిర్మలసత్వానికి పోయి- 'చెడిపోయిన వాళ్ళంటే ఎవరో కాదు, ప్రతిదినం మన యింటికి అడుక్కోన వచ్చేవాళ్ళు. వాళ్ళకు పిల్లలు అధికంగా పుడతారు. పిల్లల్ని పెంచే తాహతు వాళ్ళదగ్గర వుండదు. అంచేత ఏదో ఓవిధంగా వదుల్చుకుంటారు' అన్నాడు. ఆ మాటల్లో పూర్తి నమ్మకం చిక్కింది సుశీకి. ఆదిలో తను చేసినయోచనకీ, నాన్నచెప్పిన దానికీ తారతమ్య మేమీ లేదు గాబట్టి నిజం అంతకంటె వేరే లేదని నమ్మింది.

తండ్రి సంతోషించాడు. అనృతం ఆడైనా అమ్మాయి నోరు కట్టించానని, మాయలోకం.




నటేశ్వరరావు పుట్టుకతోనే నటుడు. చిన్నతనంనుంచీ అతను తన నటనాకౌశలం ప్రదర్శిస్తూ వొచ్చాడు. క్లాసులు ఎగ్గొట్టటానికి చెప్పే అబద్ధపు సాకులు సమర్థించుకోటానికి చేసే భావప్రదర్శనతో అతని నటన ప్రారంభమైంది. నాయనమ్మ చనిపోవటంవల్ల దుఃఖం; తలనొప్పి, కడుపునొప్పి ఇత్యాదులవల్ల కలిగే బాధ; మాస్టర్లపైనా, వాళ్ళ చేతిబెత్తాలపైనా భయభక్తులూ ఎంతో సహజంగా అభినయించి ఫలితం అందుకునేవాడు. వయస్సుతోపాటు ఊహా పెరిగినకొద్దీ అతను తన నటనాశక్తిని అన్ని విధాలా పూర్తిగా ఉపయోగించుకోటం ప్రారంభించాడు. డబ్బు లేకుండా కాఫీహోటలుకు వెళ్ళి సర్వరు నోరు తెరుచుకునేలా తిని, బిల్లు అయ్యర్ టేబిల్ మీద పెట్టి, దర్జాగా జేబులో చెయ్యి పెట్టి, ఒక్కసారిగా తెల్లమొహం వేసేవాడు, పర్సు పోయినట్టు అప్పుడే తెలుసుకున్నవాడిలా. అయ్యర్‌కి ఇటువంటి వ్యవహారాలు మామూలే అయినా, నటేశ్వరరావు ముఖంలోని ఆందోళనా, భయమూ, అతని పెద్దమనిషి తరహా ప్రవర్తనా చూసి బోల్తాపడక తప్పేది కాదు. ఇలా అమాయకంగా ముఖం పెట్టి, జాలిచూపులు చూసీ, అవసరమైతే గంభీరంగా, నిశ్చలంగా తొణకని చూపులు చూసి చేసిన తప్పులకి అనుభవించాలిసిన శిక్ష లెన్నో తప్పించుకున్నాడు. అతని వదనం ఎలాటి భావప్రదర్శనకైనా అనుగుణమే. అతని ప్రయత్నం లేకుండానే ముఖకవళికలు అతని భావాల కనుగుణంగా మారతాయేమో ననిపిస్తుంది.

రంగస్థలం మీదకి రాకముందే నటనలో ఎంతో అనుభవం సంపాదించిన నటేశ్వరరావు రంగంమీద అద్భుతంగా ప్రకాశించగలగటంలో ఆశ్చర్యమేముంది? అతను కాలేజీలో చదివి నన్నాళ్ళూ కాలేజి నాటకరంగం ప్రభ వెలిగింది. తర్వాత అమెచ్యూర్ ఆర్టిస్టుగా, ఆతర్వాత కంట్రాక్టు నాటకాల్లో నటించీ అశేషమైన కీర్తి సంపాదించుకున్నాడు. నటేశ్వరరావు విజయానికి కారణం అతను నటిస్తున్నంతసేపూ అది నటన అనుకోడు. గిరీశంగా ఎంత బాగా నటిస్తాడో హరిశ్చంద్రుడుగాకూడా అంత బాగా రాణిస్తాడు.

నిస్సందేహంగా నటేశ్వరరావు గొప్పనటుడే. ఇందుకు అతని పరిచితులమైన మేమెంతో గర్విస్తాము. కాని దురదృష్టవశాత్తూ నటేశ్వరరావు నటనే తన ఆదర్శంగా పెట్టుకున్నాడు. రంగంమీదేకాక జీవితంలోకూడా నటుడిగానే జీవించ దలచుకున్నాడు. నటేశ్వరరావునుంచి నటనని విడదీయలేము. ఇది చాలావరకూ అతని పతనానికి కారణమైంది. నటుడిగా నటేశ్వరరావు ఎంత గొప్పవాడో నైతికంగా అతనంత పతితుడు.

పాత్రలో లీనంకావటం నటేశ్వరరావుకి గొప్పతనంతోపాటు చిక్కుల్నికూడా తెచ్చిపెట్టింది. స్నేహితుల్ని అప్పు అడిగితే అది నిజంగా అవసరమై అడుగుతున్నాడో లేక

జబ్బేదో తెలియక వాళ్లు లేదనటం, అతను డబ్బు పుట్టక నానా అవస్థలూ పడటం కొత్త కాదు. అబద్ధం చెప్పినా నిజం చెప్పినా భావ ప్రకటనమాత్రం ఒకేవిధంగా నమ్మించేదిగా ఉండటంవల్లా, అతని ప్రవర్తన అందరికీ తెలిసిందే కావటంవల్లా మాలో ఎవరికీ అతనంటే జాలి పుట్టేదికాదు.

కాలేజీలో చదువుతున్న రోజుల్లో నటేశ్వరరావుకి విద్యార్థులలో గల పలుకుబడీ, అతని సుందర విగ్రహం, నటనా చాతుర్యం విద్యార్థినుల కటాక్ష వీక్షణాలను ఆకర్షించాయి. నాటకరంగంమీద అతనిసక్క నటించటానికి కుతూహలం చూపేవాళ్లు కొంతమంది విద్యార్థినులు. ఓసారి కాలేజీ నాటకమండలి లైలా-మజ్నూ నాటకం ప్రదర్శించింది. ఖైస్ (మజ్నూ)గా నటేశ్వరరావు, లైలాగా అతన్ని అభిమానించే ఓవిద్యార్థిని వేషాలు ధరించారు. నాటకం సాగుతున్నకొద్దీ నటేశ్వరరావు పాత్రలో లీనమై పోతూవచ్చాడు. ప్రణయం ప్రదర్శించే ఘట్టం వొచ్చింది. లైలా అంది: "ఖైస్, నీ జీవితాశయం ఏమిటి?" నటేశ్వరరావు లైలా పాత్రవైపు ప్రణయం ఉట్టిపడేలా చూశాడు. "లైలా, నీతో ఐక్యంకావటమే నా జీవితాశయం." ఈ మాటలు నటేశ్వరరావు హృదయం లోంచి వొచ్చాయి. నటేశ్వరరావు ఇప్పుడు పాత్రలో పూర్తిగా లీనమై పోయాడు. ఇప్పుడతను ఖైస్. ఖైస్ లో ప్రణయమంతా అతనిలో కరడు కట్టింది. అతని కళ్లముందున్నది లైలా కాని నటిస్తున్న విద్యార్థిని కాదు. యంత్రంలా మాటలు అప్పచెప్పటం అతని తలకు మించిన పని. "నీతో ఐక్యం కావటమే నా జీవితాశయం, లైలా" అంటూ నటేశ్వరరావు లైలా పాత్ర ధరించిన విద్యార్థినిని గాఢంగా హృదయానికి అదుముకున్నాడు. వెంటనే ఈలలు, కేకలు, బల్లల చప్పుళ్లూ చెలరేగాయి. లైలా పాత్ర వేసిన అమ్మాయి లోపల సంతోషించినా ఈ అల్లరి చూసి బెదిరిపోయింది. మాన రక్షణకోసం తర్వాత ప్రిన్సిపాలుతో రిపోర్టు కూడా చేసింది. వారం రోజులపాటు సస్పెండు అయాడు నటేశ్వరరావు. ఈ పని దురుద్దేశంతో ఎంతమాత్రం చేయలేదనీ, తనకి నటిస్తున్నప్పుడు లోకమర్యాదలు జ్ఞాపకం ఉండవనీ అవసరమైతే క్షమాపణ కూడా చెప్పుకోటానికి తన కభ్యంతరం లేదనీ నటేశ్వరరావు అంటే మాత్రం ఎవరు నమ్మగలరు? ఈ ఘటనవల్ల నటేశ్వరరావుకి ఇంకో అపకారం జరిగింది. అతను మరో విద్యార్థినితో ప్రణయకలాపం సాగించాడు. ఆమె నాటకం చూసి నటేశ్వరరావుని అపార్థం చేసుకుంది. "నువ్వు నటుడివి, నీతో నాకేమీ సంబంధం లేదు. లైలాదగ్గరే నీ ప్రణయం ప్రదర్శించుకోవొచ్చు." అని ఖండితంగా అనేసింది. పాపం, నటేశ్వరరావు ఆమెకి అర్థమయేలా చెప్పటానికి ప్రయత్నించాడు కాని ఫలించ లేదు.

పాత్రలో లీనం కావటం వల్ల ఇలాంటి ఘటనలెన్నో నటేశ్వరరావు జీవితంలో జరిగాయి. అయితే తన చాతుర్యం వల్ల అతనికి కలిగిన లాభాలు కూడా తక్కువంటానికి వీల్లేదు. ఒక్కొక్కసారి ఆలోచిస్తుంటే జీవితంలో నటించటం నటేశ్వరరావుకి అతని ప్రయత్నం లేకుండానే జరుగుతుందేమో ననిపిస్తుంది. బహుశా దీనికి కారణం నటనలో అతనికి పుట్టుకనుంచీ ఉన్న ప్రావీణ్యమే కావొచ్చు.

నాటకాలతో విసుగుపుట్టి నటేశ్వరరావు ప్రభుత్వోద్యోగంలో చేరాడు. డబ్బుకోసం బాధపడినవాడు కావటంచేత అతని కెలాగైనా బాగా సంపాదించాలని ఉంది. లంచాలు జోరుగా పట్టాడు. నటేశ్వరరావు వంటివాడికి విరోధు లుండటం గొప్పసంగతి కాదు. అతను లంచాలు తీసుకోటం, అతనిమీ దెలాగైనా ఓ దెబ్బ తీయాలని సంకల్పించుకున్న విరోధులకి మంచి అవకాశం కలిగించింది. నటేశ్వరరావుని అవమానం చేయటానికి వాళ్లు ఓ వింత పద్ధతి అవలంబించారు. అతనిని లంచాలు తీసుకోని ప్రభుత్వ సేవకుడుగా భావిస్తున్నామనీ, అంచేత అతనికి ఓ పెద్ద సన్మాన సభ ఏర్పాటుచేసి గౌరవించటం లంచగొండితనం నిర్మూలనకి ఎంతో అవశ్యకమనీ, సభకు తప్పక దయచేయవలసిందనీ ఆహ్వానం పంపేరు. నటేశ్వరరావు నిజంగా పొంగిపోయాడు. సన్మానసభలో లంచగొండితనంమీద అనర్గళంగా ఉపన్యసించాడు. "లంచం తీసుకోటటం అధమాధమం. దీన్ని-

ప్రజలందరూ కలిసి అరికట్టాలి. సాంఘికంగానే గాక వ్యక్తిగతంగాకూడా లంచం విసర్జనీయం. లంచం అంగీకరించటమంటే మనిషికిగల ఉదాత్తమయిన ఆత్మని చంపుకోటమే. సాంఘికంగా దీనివల్ల కలిగే నష్టాలు, బాధలూ అందరికీ తెలిసినవే. ప్రతి ఒక్కడూ లంచగొండితనాన్ని అరికట్టటానికి ఇలా పూనుకొంటేగాని"— సాగించాడు గోరణి. తమపథకం ప్రకారం సభలో చేరిన అతని విరోధులు కేకలు ప్రారంభించారు- "మొదటిరకం లంచగొండి నటేశ్వరరావే" అని. కాని వాళ్ల పథకం పారలేదు. ప్రజల్లో అలజడి ప్రారంభమైంది. నటేశ్వరరావు తొణకకుండా బ్రహ్మాండంగా ఉపన్యసిస్తున్నాడు. ఇప్పు డతని పాత్ర లంచగొండితన నిర్మూలన ప్రచారకుడు. పాత్రలో లీనమైపోకూడదు. సభికుల మనస్సులు చూరగొన్నాడు. విరోధులు కేకలు వేస్తూనే ఉన్నారు. "ఎవరైనా ఆ కేకలు - మర్యాదగా కూర్చుంటారా? మక్కలు విరగ తన్నాలా!- గిట్టకపోతే నోర్లు ముయ్యండి-" ప్రజలు గర్జించారు. ఇంతమంది ప్రజల్ని పిలిచినందుకు నటేశ్వరరావు విరోధులు తమనితామే నిందించుకున్నారు.

నటేశ్వరరావు మాటల్లో అతని జీవిత రహస్యం ఇది: "ఈ ప్రపంచం ఓ పెద్ద నాటకం. అందులో నేను కేరక్టర్ యాక్టర్ని. ఏ పాత్ర అయినా సరే, అందులో లీనం కావటం నా విశేషం. జీవితంలో నా జయాపజయాలకి కూడా కారణం అదే."

# ఆంగ్లసాహిత్యం : 'బ్రాంటీ సిస్టర్స్'

మాలతీ చందూర్

పందొమ్మిదవ శతాబ్దంలో స్త్రీ రచయితలూ, చిత్రకారిణులూ చాలా అరుదుగా వుండేవారు. ఎక్కడైనా స్త్రీ తనమనసులోని అభిప్రాయాల్ని నవలా రూపంలో రచించినా తన పేరుకు బదులుగా పురుషుని పేరుపెట్టి ప్రచురించేది. ధైర్యంగల స్త్రీ ఎవరైనా తనపేరుతో ప్రకటించినా "స్త్రీలు నవలలు రాయడమా" అని చులకన చేస్తూండేవారు నాటి రచయితలు. స్త్రీ వ్యర్థురాలనీ, అబలనీ, సాహిత్య సేవకి పనికిరాదనీ అనుకునే రోజుల్లో ఒకే తల్లి కడుపున జన్మించిన చార్లొటీ, ఎమిలీలు ఉత్కృష్ట గ్రంథాలు రచించి సాహిత్యలోకంలో చిరస్మరణీయులయారు. ఎమిలీ-చార్లొటీలు సారస్వతంలో తుళ్లా ప్రకాశించారు. "ఎక్కో పల్లెపట్టున, ఏ అవకాశాలూ లేనిచోట నిరాడంబర జీవితం గడుపుతున్న ఈ స్త్రీల హృదయంలో అంతకావ్య సౌందర్యం ఏమూల దాగుందో"- అని థేకరే వంటి విద్వాంసుడు తెల్లబోయాడు.

ఎమిలీ నిశ్శబ్దాన్ని, ఏకాంతాన్ని కోరేది. సంతోషం ఆమె స్వభావంలో లేదు. ఎప్పుడూ తెల్పరాని అశాంతి ఆమె గుండెల్ని పిండేది. హృదయభారం దిగమింగి నిత్యకృత్యాల్ని చేసుకునేది ఎమిలీ. ఇహలోక జీవితంలోని ఆనందం పూర్ణత్వ అడుగడుక్కీ ఆమెని కలచివేసేది. మబ్బుల వెనకనుంచి ఏదో పిలుపు అనుక్షణం ఆమె చెవులకి ప్రళయగీతికవలె వినపడేది. ఆ పిలుపులో కర్కశత్వమేగాని మార్దవం వుండేది కాదు. అది విధాతపన్నిన వుచ్చు! ఆ పిలుపునే 'వదరింగ్ హైట్స్' (Wuthering Heights) లో సుప్రకాశంగా చిత్రిస్తుంది.

చార్లొటీ, ఎమిలీ అంత నిరాశావాది కాదు. ఆమె జీవితంలోకూడా నిస్పృహ లేకపోలేదు. కాని నైరాశ్యాన్ని వాస్తవిక దృష్టితో పాఠకులకి ప్రదర్శిస్తుంది. ఆమె రచించిన 'జేన్ ఐర్' నవలని మనం మర్చిపోలేము. ఆ 'జేన్ ఐర్' తో కూడా అనాథాశ్రమంలో మనం చదువుకుంటాం. ఆమె బాధలు మనం పంచుకుంటాం. జమీందారయిన రాచెస్టర్ యింట్లో ఆమె వుపాధ్యాయినిగా కుదురుతుంది. ఆఖరికి కంటి వాకై, కళ్లు రెండూ పోయి, ధనసంపత్తి నంతా పోగొట్టుకున్న రాచెస్టరునే జేన్ పెళ్ళాడటం మన భారతీయ దృక్పథానికి బాగా నచ్చుతుంది.

ఇంజనీరుగారి ఏకైక ముద్దులకుమార్తె. ఆమెకు ఏ విషయంలో దిగులుంటుంది?

గోపాలం ప్రస్తుతం చూస్తున్న సీటులోని పని చాలా కొత్తది. ఇదివరకు ఎన్నడూ చెయ్యని కొత్తపని. బండపని. రోజూ ఇరవై నాలుగు గంటలూ చేసినా తెమలదు. తనకు తెలియనప్పుడు పక్కవాళ్ళ నడిగి తెల్సుకుందామంటే ఎవరూ చెప్పరు. ఆ ఆఫీసులో గుమాస్తాలంతా అదోక వింత ప్రకృతి కలవారు. ఎవటివాడు కనీసం తెల్లని చొక్కా వేసుకున్నా, గడ్డం నున్నగా చేసుకున్నా ఓర్చలేరు. అయనేం దొరగారి తరవాత దొరగా రంతటి వా డంటూ రు. తమ మాదిరి మాసిన గడ్డాలతో, భుజాలు చినిగిన చొక్కాలతో, నస్యంపట్టుపట్టి ఆ ముక్కు జేబురుమాలు అంటే ఏమిటో ఎరక్కపోవటం చేత భుజాలకు తుడుచుకుంటూ, కళ్ళద్దాలను పైకి ఎగదోసుకుంటూ, పగలనక రాత్రనక పని చేస్తూవుండాలి. తెలీనివాళ్ళకు తమకు తెల్సిన విషయాలు చెపితే అవన్నీ వాళ్ళు తెల్సుకుపోతారేమోనని భయం. ఇటువంటి వాతావరణంలో పని చేస్తున్నాడు గోపాలం. అర్జంటుగా గవర్నమెంటుకు పోవలసిన డిస్పోజలు సాయంత్రానికల్లా పూర్తిచేసి తీసుకురమ్మన్నాడు ఇంజనీరు గోపాలాన్ని. ఫైళ్ళన్నీ చదివి తల పగలగొట్టుకున్నా అర్థంకాలే దతనికి. ఎవర్నడిగినా చెప్పలేదు. చివరికి ఎట్లాగోట్లా రాసి పూర్తిచేసి పచ్చ కవరు వేసి కోటు తొడుక్కుని ఫైలు చంకన బెట్టుకుని కాళ్ళు గజగజ లాడుతుండగా, చేతులు వణుకుచుండగా, గుండె దడదడ లాడుచుండగా సాయంత్రం ఆరు గంటలకు బంగళా దగ్గర కొచ్చాడు గోపాలం.

గేటుదాటి లోపలికొచ్చేసరికి తోటలో ఎదురుగుండా ఆ స్థితిలో ఉయ్యాల ఊగుతున్న మనోరమ కనిపించింది. గుండె దడ ఆగింది. కాళ్ళ గజగజ తగ్గింది. చేతుల వణుకు పూర్తిగా పోయింది. ముఖంమీద చెమట ఆరిపోయింది. చేతులో ఫైలు ఉన్నదా లేదా అని పించింది. పచ్చ కవరుగల ఆ రిఫరెన్సు విషయం మనస్సులోంచి తప్పిపోయింది. మెల్లిగా సిగరెట్టు తాగుతూ, పొగను సూటిగా దర్జాగా వదులుతూ, తెల్లతెల్లగా ఉంగరాలుగా తిరుగుతూ మెల్లిగా పైకి పోయే ధూమమాలికలు చూస్తూ నిల్చున్నాడు. రెపరెపలాడుతూ మిలమిల మెరిసేటి ఆమె కనుసోయగాన్ని చూస్తూ, ఆఫీసు వాతావరణంలో ప్రవేశించి ఏనాడో మర్చిపోయిన తను చదివిన ప్రబంధ గ్రంథాలు స్ఫురణకు రాగా-ఆమె కళ్ళే నల్లకలువలా, తుమ్మెద రెక్కలా లేక ఆమె మీనలోచనా, మరి చంచల నేత్రములు గల చిన్నారి మగువా అని ఆలోచిస్తూ, ఆమె ఉయ్యాల్లో కూర్చున్న తీరునీ, నల్లత్రాచువలె నిగనిగలాడుతూ ఉన్న ఆమె వాలుజడ ముందువైపు అత్యున్నత ప్రదేశము మీద నాట్యము చేయుచుండగా ఆ సొగసును తిలకిస్తూ, వీణాతంత్రులను మించిన ఆమె కంఠ మాధుర్యాన్నీ, ఆమె ముంజేతి గాజుల చప్పుడులోని కమనీయ మాధుర్యాన్నీ విని ఆనందిస్తూ వున్న సమయంలో-

"వాటీజ్ దట్ యు ఆర్ సీ యింగ్" అనే సింహగర్జన వినిపించింది. ఆలస్యమైనందుకు చింత నిప్పులు కక్కుతూ పంట్లాము జేబుల్లో రెండు చేతులూ పెట్టుకుని బింకంగా నెపోలియన్ నిల్చున్నట్లుగా వరండాలో నిల్చుని, గోపాలంమీది కోపాన్నంతా పొగరూపంలో వెళ్ళగక్కుతున్నాడా అన్నట్లుగా, 'పైప్' లోనుంచి పొగ వదులుతున్న ఇంజనీరుని చూశాడు గోపాలం. ప్రబంధకావ్యంలోని మాటలు ఎగిరిపోయినయి.- కోటు గుండీలు సరిగ్గా పెట్టుకున్నాడు. మళ్ళీ గుండె దడదడా, కాళ్ళ గజగజా, చేతుల వణుకూ మొదలు పెట్టినయి. నేనూ ఉన్నా నన్నట్లుగా పచ్చ కవరుగాలికి రెపరెపలాడింది. గౌరవపూర్వకంగా ఫైలు చేతిలోనే పెట్టుకుని ఒక్క నమస్కారం పెట్టాడు గోపాలం-

"అయిపోయిందండి" అన్నాడు గొంతు పెగుల్చుకుని.

"దెన్ కమాన్, వై డు యు స్టాండ్ దేర్" అని ఆఫీసు రూములోకి వెళ్ళాడు ఇంజనీరు. వరండాలో నిల్చుండటం నుంచి మనోరమ అయనకు కనబడలేదు. గోపాలం ఊరికేనే అక్కడే నిల్చున్నాడని అనుకున్నాడు. తండ్రి మాటలు విన్నది మనోరమ. ఉయ్యాలా దిగి నిల్చుని నడుంమీద రెండు చేతులూ గట్టిగా పెట్టుకుని ముఖం సీరియస్‌గా పెట్టి - "ఆ డిస్పోజలు

యిపుడర్థంటు. ఆ ఫైలుకు అమాంతం ఎర్రసిరాలో ముంచావా?" అని బింకంగా అని పక్కున నవ్వి చిన్నగా చప్పట్లు కొడుతూ ఇంట్లోకి పరుగెత్తింది మనోరమ.

"ఖర్మ - ఎంత లోకువై పోయినాను" అని మనస్సులో అనుకుని చకచకా ఆఫీసు గదిలోకి వెళ్ళిపోయాడు గోపాలం. ఆరోజు రాత్రి చివాట్లతో డ్రాఫ్టు పూర్తి చేయించుకుని పది గంటలకు ఇంటికి వెళ్ళాడు గోపాలం కాళ్ళీడ్చుకుంటూ.

నాలుగు రోజులు పోయింతరువాత ఒక నాడు ఉదయం ఏడు గంటలకల్లా రమ్మన్నాడు ఇంజనీరు గోపాలాన్ని ఏవో కాయితాలు తీసుకుని. గోపాలం యథాప్రకారంగా వెళ్ళాడు కాయితాలు తీసుకుని. వాకిట్లో జవాన్లు లేరు. వెళ్ళి ఆఫీసు రూములో కూర్చున్నాడు. ఇంజనీరు ఇంకా రాలేదు. మళ్లీ ఏం చివాట్లు తగుల్తాయో అని భయపడుతూ ఫైలు తీసి చదువుతూ కూర్చున్నాడు.

తలుపు తీసిన చప్పుడయింది. గోపాలం గుండె గతుక్కుమంది. కోటు బొత్తాలు సవరించుకుని లేచి నిల్చున్నాడు:

"నాన్నగారనుకున్నారా?"

తలెత్తి చూశాడు. మనోరమ గుమ్మం దగ్గర నిల్చుంది. ఆయన చూస్తే తన పని ఏమవుతుందోనని భయపడుతున్నాడు గోపాలం.

"నాన్నగారు ఇంకో గంటదాకా నిద్ర లేవరు. రాత్రి కాయితాలు చూస్తూ చాలాసేపు మేలుకున్నారు. మిమ్మల్ని పొద్దున్నే రమన్నారా?" అంది మనోరమ.

"అవును, రమ్మన్నారు. అందుకే వచ్చాను" అన్నాడు ముభావంగా.

"ఈ అధికార్లు అంతా అంతే. తమ అధికారిత్వమంతా తమ తాబేదార్లమీద చూపిస్తూ వుంటారు. ఇప్పుడు చూడండి - పొద్దున్నే మిమ్మల్ని రమ్మన్నారు. ఆయ నింకా నిద్ర కూడా లేవలేదు. ఇంజనీరుగారు రమ్మన్నారని మీరు అయిదు గంటలకల్లా లేచి స్నానం చేసి ఫైల్లు చదివి భయపడుతూ భయపడుతూ వచ్చారు. అవునా?"

తల ఊపాడు.

"రాజకీయాల్లో సామ్రాజ్యవాద పరులూ, పెట్టుబడిదారుల బుద్ధి ఎట్లా వుంటుందో అధికార్ల దృష్టి తాబేదార్ల విషయంలో అట్లా వుంటుంది. తమకన్న ఎక్కువ సంసారపు జంజాటనా, పిల్లలగొడవా వుంటుందనీ, అన్ని పస్తూ వాళ్లే చేసుకుంటూ వుండాలనీ ఈ ఆఫీసర్లకు ఇంగిత జ్ఞానం ఏమీ ఉండదు."

తనను పరీక్షించటానికి అట్లా అంటున్నదా లేక తనబోటి వారిమీద సానుభూతి చూపించటమా అని తికమక పడుతున్నాడు గోపాలం. ఆమె మాటలకు ఏదో సమాధానం చెబుతూ, అవకతవకగా అధికార్ల నిరంకుశత్వాన్ని గురించి తనూ మాట్లాడితే ఈ సంగతి ఆమె తండ్రితో చెబితే తనపని ఏంకావాలి?

"ఏదోలెండి ఎవరి అభీష్టం వారిది. అంతా అందల మెక్కితే మోసేవారు మాత్రం ఎవరుంటారు?"

"నిల్చునే మాట్లాడుతున్నారు. కూర్చోండి. మీరు పట్టభద్రులేనా?"

"అవును."

"పాపం! ఆంగ్ల విద్యాలయాల్లో విద్య నభ్యసించి ఆస్తిపాస్తులను కర్పూరహారతిలా వెలిగించి వేరే పనిపాటలు ఏమీ చేతగాక గానుగెద్దుల్లాగా ఈ గుమాస్తా ఉద్యోగాలకు తయారయే ఈ గుమాస్తాలని చూస్తే నాకు చాలా విచారం కలుగుతుంది. ఈ నలభై అయిదు రూపాయిల్లో భార్యా బిడ్డల్ని ఈ కరువుకాలంలో ఎట్లా పోషిస్తున్నారో నాకు అగమ్యగోచరంగా వుంది. అంటున్నానని కోపగించుకోబోకండి. మీకు నెల మొత్తంమీద వచ్చే జీతము మాబోటి వాళ్లిళ్లలో ఒక్కరోజు కట్టుకు చీరె ఖరీదు చెయ్యదు."

గోపాలం తల వంచుకున్నాడు. ఇదేమిటా ఈ పిల్ల ఇట్లా మాట్లాడుతున్నది, ఆయన చూస్తే ఏమనుకుంటాడో అని భయపడుతున్నాడు.

"నాన్నగారు వచ్చిన తరువాత వస్తా లెండి- వెళతాను."

"కూర్చోండి. మీ ఉద్దేశం నాకు అర్థమయింది. నాన్నగారు చూస్తే ఏమంటారోనని మీరు భయపడుతున్నట్టుగా వున్నారు. నా అంతట నేమాట్లాడుతున్నాగాని మీరు కావాలని నాతో మాట్లాట్టంలేదు కదా! ఈపూట బజారు

పెళ్ళి కూరకూడా తెచ్చుకోకుండా చేశారు నాన్న."

"నాకు వివాహం కాలేదండి. హోటలు భోజనమే; అంచేత బజారు ప్రమేయం లేదు నాకు."

మేడమీదనుంచి ఎవరో దిగుతున్న చప్పుడయ్యింది. మనోరమ వెళ్ళిపోయింది లోపలికి.

"ఎంత సేపయింది, గోపాలం, వచ్చి?" అన్నాడు ఇంజనీరు కుర్చీలో కూర్చుంటూ.

"ఇప్పుడేనండీ, పావుగంటవుతుంది."

"రాత్రి చాలాసేపు కాయితాలు చూస్తూంటంచేత ఆలస్యంగా నిద్రలేచాను. ఇంకా స్నానం అదీ అవలేదు. ఇంకోప్పుడు చూద్దాంలే. వెళ్ళిరా" అని మళ్ళీ వెళ్ళిపోయాడు మేడమీదికి. గోపాలం ఉసూరుమంటూ బయటికొచ్చేశాడు.

ఇదివరలో ఆమెను చూసినప్పుడు ఆమె సౌందర్యానికి ముగ్ధుడయాడు గోపాలం. ఇప్పుడు తనతో మాట్లాడ్డమే కాకుండా తన తోటి గుమాస్తాలమీద సానుభూతి చూపిస్తూ అధికార్ల నిరంకుశ విధానాన్ని ఖండిస్తూ మాట్లాడ్డంనుంచి ఆమె చాలా దయాహృదయురాలని గ్రహించాడు. కాని పరాయిమగవాడితో, అందులో తండ్రి ఆఫీసులో ఒక చిరుగుమాస్తాతో ఇంత ఇదిగా మాట్లాట్టానికి గల కారణం ఏమిటో అతనికి అర్థం కాలేదు.

మర్నాడు సాయంత్రం ఇంజనీరు రమ్మని చెప్పకపోయినప్పటికీ గోపాలం వెళ్ళాడు, కాయితాలకట్ట చంకన పెట్టుకుని. మనస్సు పరిపరివిధాల పోయింది. అధికారమదాంధకారంలో కొట్టుకుంటున్న ఆ తండ్రికీ, తమకున్న ధనరీత్యా, అధికారరీత్యా తక్కువ తరగతి వారియందు, అందులో తన తండ్రి ఆఫీసులో గల గుమాస్తాల విషయంలో ఇంత చనువుగా చిరపరిచితురాలివలె మాట్లాట్టమే గాకుండా సానుభూతి చూపించే దయార్ద్ర హృదయురాలు ఎట్లా కలిగిందో అతనికి ఆశ్చర్యం కలిగింది. అదృష్టహీనులకు తాను పాన్పై కరచనవిధాన ఆమె కరుణారసపూరితమైన మాటలే తన కొంప తీస్తాయేమోనని భయము ఒకవైపు కలిగేసరికి, తాచుపాము పడగనీడలో కప్ప పేద తీర్చుకున్న సామెతగా అవుతుందేమో తనపని అనుకున్నాడు.

గేటుదాటి లోపలకు వెళ్ళగానే మనోరమ మేడమీద కనిపించింది. ఆమె ముఖం చాలా చిన్నబోయినట్లుగా వుంది. మేడమీదనుంచే ఒక్కతడవ గోపాలంవైపు చూసి చివుక్కు తిరిగి వెళ్ళిపోయింది. ఆ చూపులో సానుభూతి, దయ, జేలత్వమూ, ఏదో ఒకవిధమైన దిగులు మిళితమై గోపాలం మనస్సుకు పెద్ద ఆలోచనను కలుగచేసింది. లోపలికి వెళ్ళకుండానే తిరిగి వచ్చేశాడు కాళ్ళీడ్చుకుంటూ.

వారం పదిరోజులు గడిచిపోయినాయి. ఇంజనీరుగారమ్మాయి మనోరమ పెళ్ళన్నారు. ఆఫీసులో గుమాస్తాలంతా పనికూడా మానుకుని ఇంట్లో పెత్తనం చేస్తున్నారు. ఆఫీసులో ఒక్కొక్క బ్రాంచి పని ఒక్కొక్కరికిచ్చినట్టుగానే పెళ్లి పనుల విషయంలోకూడా అందరికీ తలోపనీ పురమాయించారు. గోపాలంకూడా ఏవోపన్లు చేస్తూనే ఉన్నాడుగాని అతనిమనస్సు మనస్సులో లేదు. ఏదో వెలితిగా, హృదయం కలచినట్లుగా, దిగులుగా భయంగా వున్నాడు. పెళ్ళిపన్లు సాగిపోతున్నాయి.

పెళ్లికొడుకు తోబుట్టువులు ఏడుగురు, మొగపిల్లాడతనొక్కడే. అతనూ ఎక్కడో జూనియర్ ఇంజనీరు చేస్తున్నాడు. పాతికవేల కట్నం. పానకం బిందెలు, బొట్టుపెట్టెలు, కాటుకాయలు, కుంకంభరిణలు, కాళ్ళ గడుగుపళ్లెం ఇట్లాంటివన్నీకూడా వెండివే. వియ్యమొందుతున్న ఇద్దరూ పెద్ద ఇంజనీర్లే. పెండ్లికొడుకూ ఇంజనీరే. మొగపెళ్లివారు కోరిందల్లా ఇస్తానన్నాడు మనోరమ తండ్రి.

మగపెళ్ళివారు స్నాతకం విడిదిలోనే చేసుకుంటున్నారు, నదిదాటి రావటంనుంచి పనికిరాదని. స్నాతకం అవుతున్నది. ఆపెళ్ళికొచ్చిన వాళ్లలో ఒక అలజడి బయల్దేరింది - ఆడబడుచు లాంఛనాలన్నీ ఏడేసి తెచ్చారు కాని వెండి బొట్టుపెట్టెలుమటుకు ఆరుమాత్రమే తెచ్చారని. ఇది అనోటా అనోటా పాకిపోయింది. పెళ్ళికొడుకు తల్లికూడా విన్నది. అక్కడనుంచీ అలిక మొదలు పెట్టింది.

"ఇంతమందిలో మమ్మల్ని చిన్నతనం చేయాలనుకున్నారు ఆంత బొట్టుపెట్టె కొనలేనివాడూ, ఇవ్వలేనివాడూ సంబంధం ఎందుకు చెయ్యాలి? పెద్ద ఇంజనీరు చేస్తున్నాడే - వాయేడో పిల్లకు బొట్టుపెట్టె ఎందుకు తేలేడు? మంచి, మర్యాద గల వాళ్ళ మనుకున్నాను. ఇంత సామాను కొని, మమ్మల్ని చిన్నతనం చెయ్యటానికి కాకపోతే, బొట్టుపెట్టె ఎందుకు కొనలేదు? ఇంత వరమలోభి అనుకోలేదు" అని సాగించింది. ఈ విషయం అనోటా అనోటా పడి మనోరమ తండ్రిదాకా పోయింది. ఇంక ఆయన నోకతొక్కిన తాచు మాదిరి లేచి—

"ఇన్నివేలు ఖర్చుచేయగా లేంది ఒక్క బొట్టుపెట్టెకు మానుకుంటామా! ఏదోది కొనుక్కు రానిమాట నిజమే. ఈసామాన్లు కొనే సందడిలో ఏదోది తీసుకోటం మర్చిపోయాము. అంతేగాని వాళ్ళని చిన్నతనం చేయటానికి, అవమానం చేయటానికినా! అంత బొట్టుపెట్టెలోనే మర్యాదలు పోయే రోజులో నా కూతురు ఎన్నాళ్ళు కాపరం చేస్తుంది - వీళ్ళంతా కలసి దాన్ని కాల్చుకుతినరా! బొట్టుపెట్టె మర్చిపోయి నారట, ఏదోది తెప్పించండని చెప్తే ఎంత బావుండేది - అయినా నాటి ప్రమేయం వచ్చి నప్పుడు నాతప్పు తెల్సుకొని అప్పుడే తెప్పిద్దును కదా! ఇటువంటివాళ్ళకి నేను నాపిల్లను ఇవ్వనే ఇవ్వను" అని రౌద్రాకారం దాల్చి పెళ్ళికొడుకువాళ్ళకు పెళ్లిచెయ్యనని కబురుచేశాడు. ఇరువైపులవారికీ పెద్ద సంఘర్షణ జరిగింది. ఫలితం పెళ్లి ఆగిపోయింది. పెళ్ళికొడుకు వాళ్ళు హోటలు భోజనం తెప్పించుకుతిని తిరుగు ప్రయాణానికి సిద్ధమయారు.

లగ్నం రాత్రి పదిగంటలకి. ఈ తగాదాలు ఆయే సరికి మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. ఇంజనీరుగారికి పిచ్చెత్తినట్టయింది. పెళ్ళి ఈవిధంగా తప్పిపోయేసరికి మనోరమ ముఖాన కత్తివేస్తే నెత్తురుచుక్క లేదు. మనోరమ తల్లి కిందపడి దొర్లి ఏడుస్తున్నది. ఇంత గందరగోళం జరిగితే ఇంక ఈ జన్మలో పెళ్ళి ఎట్లా అవుతుందని. గుమాస్తాలంతా వాడిలి పోతున్నారు, మధ్యలో తామేదంటే ఆయన ఏమంటాడోనని. అక్కడి పరిస్థితులన్నీ నానారభసగా వున్నాయి.

మగ పెళ్ళివారు అంతా వెళ్ళిపోయారు. సాయంత్రం ఆరుగంటలయింది. సవ్యంగా జరిగితే మరోగంటకు పీటమీద కూర్చోవాలి. ఇంజనీరు గారు పడక కుర్చీలో కూర్చొని ఆలోచిస్తున్నాడు. గోపాలం సామాను కొట్టుకు తాళం వేసి తాళం చెవులు ఆయనకు ఇవ్వటానికి వస్తున్నాడు. గోపాలంవైపు ఎగాదిగా చూసి ఒక్క చిన్న నవ్వు నవ్వాడు. గోపాలం వాడిలిపోయినాడు, ఇదేమిటా అని.

"గోపాలం, మీ అమ్మగారూ, నాన్నగారూ, వాళ్లూ ఎక్కడున్నారు?"

"నాకు తల్లిదండ్రు లెవరూ లేరండి - మేనమామల ఇంట్లో పెరిగాను. వాళ్లు కాకినాడలో వున్నారు. అంతకన్నా నా కెవరూ లేరు." అన్నాడు బెరుగ్గా - ఇదంతా ఎందుకు అడుగుతున్నాడా అని.

"మంగళ స్నానాలకి తయారవ్వు. ఏదో బొట్టుపెట్టె మినహా అన్నీ నీవే. ఏదో బొట్టుపెట్టె అసలు తీసుకురాను. మనోరమను నీ కిచ్చి చేస్తాను" అని ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

గోపాలం కళ్లు అప్రయత్నంగా సంధ్యాంధకారంలో కలసిపోతున్న ధూమలతికల వెనువెంట ఆకాశానికి ఎగిరి కొత్త సుందరలోకాలు తిలకిస్తున్నాయి.



# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## పోలీసు ఉద్యోగుల పెన్షను

ఫస్టుక్లాసు పోలీసు పెన్షన్ కానిస్టేబిల్సుకు నెల 1కి రూ 10-12-0లు జీతం వుండేది. గత యుద్ధం కారణంగా జీవితావసర వస్తువుల ధరలు విపరీతముగా పెరిగిపోవుటవలన మద్రాసు ప్రభుత్వం 14-12-1943 వ తేదీ జీ. ఓ. నెం. 581 ప్రకారం మాకు రూ 3 లు ఇంక్రిమెంటు చేశారు. పరిస్థితులవృద్ధ్యాశం మరీ జాస్తీగా వుండుటవలన 25-6-1945 వ తేదీ, జీ.ఓ. నెం. 728 ప్రకారం మరో రూపాయి కరువు బత్తెములో ఇంక్రిమెంటు చేశారు. తరవాతకూడా ప్రజల జీవనవ్యయ ప్రమాణం విపరీతముగా హెచ్చిపోవటంవలన మద్రాసు ప్రభుత్వం మళ్లీ 22-1-47 వ తేదీ జీ ఓ. నెం 45 రు ప్రకారం మరో నాలుగురూపాయలు ఇంక్రిమెంటు చేశారు. అప్పటికి రూ 10-12-0లు జీతంవున్న పెన్షన్ కానిస్టేబిలుకు మొత్తం రూ 18-12-0లు నెలకు వస్తోంది. ఇంతవరకు మన దేశంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం తొలగలేదు. కాని, యీ సంవత్సరం మొదట్లో అమల్లోకి వచ్చిన జీ. ఓ. నెం 793 రు ప్రకారం ప్రభుత్వం మాకు యిచ్చుచున్న కరువు బత్తెములో నాలుగు రూపాయిలు తగ్గించారు. అంటే ప్రస్తుతం రూ 14-12-0లు యిస్తున్నారు. జీవితావసర వస్తువుల ధరలు మునుపటికంటె ఎక్కువగా పెరిగి జీవితం గడుపుట దుర్లభముగానున్న యీ రోజుల్లో ప్రభుత్వం మా కిచ్చుచున్న కరువు బత్తెములో నాలుగురూపాయలు తగ్గించుట శోచనీయం. పిచ్చుకమీద బ్రహ్మాస్త్ర మన్నట్లు నెలకు రూ 18-0-0 లు జీతం తెచ్చుకొంటున్న మాజీతములో కోతవలన ప్రభుత్వమునకు మాపైన నిర్లక్ష్యభావము వెల్లడి యగుచున్నది. మా సుఖములనేగాక మాభార్యా బిడ్డల సౌఖ్యానందాన్నికూడా త్యజించి దేశ రక్షణకు - దేశంలో శాంతి భద్రతలను కాపాడుటకు నిరంతరం కృషి చేసిన మాపై ప్రభుత్వం నిర్లక్ష్యభావము పూనుట శోచనీయం.

ఈ విషయమై ప్రభుత్వంవద్దకు పెన్షన్ వుద్యోగస్థులు రాయబారము పోవుచున్నారని తెలియుచున్నది. ప్రభుత్వం వెంటనే మా కోర్కెను తీర్చి మమ్ము సంతృప్తి పెట్టగలదని ఆశిస్తున్నాను.

కె. కొత్తపాలెం మత్తి లక్ష్మయ్య
పెన్షన్ కానిస్టేబిల్

---

## నాగావళీ ప్రాజెక్టు భూములకు నీటి సప్లయి

నాగావళీనదిపై తోటపల్లివద్ద నిర్మింపబడిన ఆనకట్ట సహాయముతో పార్వతీపురం- పాలకొండ తాలూకాలలో 32,000 ఎకరముల భూమికి నీటిసప్లయి కాబడి వరిపంట పండింప

బడుచున్నది. ఈ భూములకు మొదటి పంటకు మాత్రమే నీరు జూన్ నెలనుంచి నవంబరు నెలాఖరువరకు నీరు సప్లయి కాబడుచున్నది. బొబ్బిలి జమీందారుగారి ప్రధానమంత్రిత్వం హయాములో కొన్ని సంవత్సరములలో ఈ నాగావళీ ప్రాజెక్టు భూములకు తిండిగింజల కింత దేవులాట లేనప్పటికీ రెండవపంటకు నీరు సప్లయిచేశారు. 1937 వ సంవత్సరములో ఈ నీటిసప్లయి ఆపివేశారు. ఆనకట్టకు దిగువనున్న కుమ్మరగుంట-నందివాడ- సాయన్నబట్టి మొదలగు రివర్ ఛానెల్సుద్వారా రెండవపంటకు పూర్వంనుంచి సప్లయి కాబడుచున్న బొబ్బిలి జమీందారీ గ్రామాలకు నీరు చాలదనే సాకుతో ఈ ఉత్తరువు జారీచేయబడినది. నాటి పరాయి ప్రభుత్వాలు కాదనలేక పోయాయి. నదిలో ప్రవహించి సముద్రములో త్వరగా కలియుచున్న నీటిని పంటలకు వినియోగించి అధికోత్పత్తికి ప్రభుత్వం పూనుకోవాలి. 1937 నుండి కూడా నాగావళీ ప్రాజెక్టు రైతులు రెండవపంటకు నీరు సప్లయిచేయవలెనని పదేపదే ప్రభుత్వానికి మొర పెట్టుకొనుచున్నను ఇంతవరకు ప్రభుత్వం శ్రద్ధ వహించలేదు. ప్రజాప్రభుత్వా లేర్పడి తిండి గింజల కొరత యేర్పడి అధికాహారోత్పత్తికై తహ తహ లాడుచున్న ఈ రోజులలోకూడా ప్రభుత్వం రెండవపంటకు నీటిసప్లయికి శ్రద్ధవహించకపోవుట విచారకరము.

ఆనకట్ట దిగువను రివర్ ఛానల్సు ద్వారా రెండవపంటకు నీరు సప్లయి కాబడుచున్న భూములలో మార్చి నెలలో మాత్రమే వరినారుమళ్లు తయారుచేసే ఆచారము కలదు. అనగా మార్చినెల తరువాతనే వారికి నీటి అవసరము కలుగును. ఈ మూడు నెలల కాలములో నదిలో వృథాగా ప్రవహించే నీటిని పైనచెప్పిన నాగావళీ ప్రాజెక్టు భూములకు రెండవపంటకు సప్లయి చేయవచ్చును. ఇంక ప్రభుత్వం అవసరమును- అవకాశమును గుర్తించి ఒక చిన్న ఆర్డరు జారీచేస్తే వేలకొద్ది యెకరములలో దాళ్వావరి- పైరుబోడి- పైరు నూవు మున్నగు పంటలు పండింపబడి కొన్ని వేల టన్నుల తిండి గింజలు ఉత్పత్తి కాగలవు. ఈ నీటి సప్లయికి ప్రభుత్వం పైనకూడవెచ్చించ నక్కరలేదు. ఉన్న ఆనకట్టలో-ఉన్న ఉద్యోగులతో నీరు సప్లయి చేయవచ్చును. అధికాహారోత్పత్తి సాగుటే గాక ప్రభుత్వమునకు కొన్ని వేల రూపాయిలు రివెన్యూ ఆదాయము రాగలదు. అధికాహారోత్పత్తివిషయములో శ్రద్ధవహించకున్నచో సామాన్యునకు సందేహముగా నున్నది.

లఖణాపురం బాబు పరాంకుశం

---

## ఎరువుల ఖరీదుల వాపసు

అగ్రికల్చరల్ డిపార్టుమెంటువారు అమ్మోనియా ఫాస్ఫేటు, ఫాస్ఫేటు, అమ్మోనియా రైతులకు సప్లయిచేసినారు. ఆగస్టు 15వ తేదీనుంచి తీసుకున్నవారికి వాటి ఖరీదులలో సగంఖరీదు వాపసు యిస్తున్నారు. చాలభాగం రైతులంతా ఆగస్టు 15 పూర్వమే ఎరువులు డిపోలనుంచి తీసుకున్నారు. వరిచేలు మూనతిరగడంతోటే మందులువేయుట అలవాటువల్ల జూలై 15 నుంచి ఆగస్టు 15 వరకు ఎక్కువమంది రైతులు వాడినారు. అట్టి వారికికూడా సగంఖరీదులు వాపసు వచ్చేలాగున ప్రభుత్వం ఉత్తర్వులు సవరించుకొనిన చాలమంది రైతులకు మేలు చేకూరును.

ఇరగవరం తం. కృష్ణానందతిలక్

---

## పాత పుస్తకాల సరఫరా

ఈ సంవత్సరం ఎస్. ఎస్. ఎల్. సి. ఇంగ్లీషు పుస్తకములు కొన్ని పాఠశాలలకు ఆలస్యముగాను, మరికొన్ని పాఠశాలలకు సగము ప్రతులు మాత్రమేను వచ్చినవి. కొన్ని పాఠశాలలకు యింకను రానేలేదు. అసలు పాఠశాలలలో పాఠములు చాలా తక్కువగా అయినవి. కావున మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖవారు గుర్తించి తగుభాగము తగ్గించవలెను.

రాజమండ్రి ఎ. పాండురంగారావు



# తెలుగు స్వతంత్ర
## విషయసూచిక


సంపుటి 2. సంచిక .2.

శుక్రవారం, అక్టోబరు 21, 1949

అజంతా చిత్రం



నాగరాణి

చిత్రకారుడు : యస్. యస్. అలంద్‌కర్

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-12

అక్టోబరు 21, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## ఫలవంతమైన పర్యటన

"రాజకీయశాస్త్రంలో పండిత నెహ్రూ మీనుమిగిలిన పండితుడు: పైగా పరిపాలనావిధానాన్ని కూలంకషంగా అర్థం చేసుకున్నవాడు." అని అమెరికా విదేశాంగ మంత్రి డీన్ అచెసన్ పండిత నెహ్రూకు స్వాగతం యిస్తూ అన్న మాటలు కేవలం గౌరవ ప్రకటనకి, లాంఛనానికి అన్నవి కావు. పండిత నెహ్రూ అమెరికా యాత్ర ప్రపంచ చరిత్రలోనే చరిత్రాత్మకమైనది: అమెరికా శాసనసభలో ఆయన యిచ్చిన ఉపన్యాసం చిత్తశుద్ధిలో, భావౌన్నత్యంలో అక్కడి ప్రజలకు వారి జాతి జనకుడు అబ్రహామ్ లింకన్‌ను స్ఫురణకు తెచ్చినది. ప్రపంచ చరిత్రలో భారత దేశం అతి ప్రాచీనమైనది. ఆధునిక యుగచరిత్రలో అమెరికాను "క్రొత్త ప్రపంచం" అని వ్యవహరించడం పరిపాటి. అమెరికా స్వాతంత్ర్యోద్యమం తరవాత, ఆదేశం వాషింగ్‌టన్, లింకన్, జఫర్‌సన్, విల్సన్, రూజ్‌వెల్టుల వంటి మహానాయకుల కృషివల్ల బ్రహ్మాండమైన అభివృద్ధి చెందింది. అమెరికా దేశ చరిత్రలో అమరమూర్తులయిన యీ నాయకుల స్మృతికి భారతదేశ ప్రజానీకపు ప్రతినిధిగా పండిత నెహ్రూ అభివందనలు తెల్పాడు.

పండిత నెహ్రూ అమెరికా యాత్ర, రారాజులకు సైతం యివ్వని ఘనమైన స్వాగతం అమెరికా ప్రభుత్వమూ, ప్రజలూ ఆయనకు యివ్వడం - ఈ సమయంలో మనం ఒక విషయం జ్ఞాపకం ఉంచుకోవలసి ఉంటుంది. అమెరికా అంటే కేవలం మార్షల్ ప్రణాళిక, మెక్ ఆర్థర్, హాలీవుడ్ చిత్రాలు, కోటీశ్వరుల కుబేర సంపద, - యివి మాత్రమే అనుకుని, అచ్చెరువు గొలిపే తక్కిన ఘనవిజయాలు విస్మరించడం వివేకం కాదు. హెరాల్డు లాస్కీ అన్నట్టు, నేటి మానవనాగరికతకే మూలస్తంభమై నిలిచిన వారి నిర్విరామకృషి, తారుణ్యదృష్టి, నిత్య ప్రవర్ధమాన కార్యానురక్తి-యివి సర్వదా అందరికీ అనుసరణీయమైనవే. అతి పురాణమైన మాత్సర్యాలతో, మత వర్గ విభేదాలతో మూల్గే మన ప్రజలవంటివారు కారక్కడి ప్రజలు. మామూలు పరిస్థితులలో బాహ్యాదృష్టికి అక్కడా రకరకాల చీలికలూ, వర్గాలూ గోచరించినా, దేశక్షేమానికి సంబంధించిన ప్రతి సంధి సమయంలోనూ అక్కడి ప్రజలు తమ అభ్యుదయకంఠం చాటి, తమ కోరికలు నెరవేర్చుకున్నారు. రూజ్‌వెల్టు పరిపాలనలోని "న్యూడీల్" ప్రణాళి

కలు ప్రజానీకానికి చెందినవే; ట్రూమన్ విజయం ప్రజావిజయం. వెండెల్ విల్కీ, హెన్రీ వాలెస్ వంటి ప్రజాస్వామ్య వాదులు అమెరికా ప్రజల మధ్యనుండే వచ్చి ప్రపంచదృష్టి నాకర్షించారు.

నేటి అమెరికా రాజకీయాలు పూర్తిగా నిష్కలంక ప్రజాస్వామికం ప్రబోధించేవి కాకపోవచ్చు. అంత మాత్రాన అమెరికా విప్లవానికి ప్రపంచ చరిత్రలో గల స్థానం విస్మరించలేము. మానవసమాజ పరిణామంలో ఆశా దీపాలవలె శాశ్వతంగా నిలిచేవి-ఫ్రెంచి విప్లవం, అమెరికా విప్లవం, రష్యా విప్లవం. వీటితోకూడా చేర్చవలసినది భారతదేశ స్వాతంత్ర్యోద్యమ విప్లవం. వ్యక్తి స్వతస్సిద్ధమైన స్వాతంత్ర్యం పరిరక్షింపబడడంలోనూ, సామాన్య మానవుడి అభ్యున్నతికీ, వికాసానికీ తోడ్పడడంలోనూ అమెరికా దేశంలో సాధింపబడ్డ విజయం యింకేదేశంలోనూ సాధింపబడలేదనడం ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. వ్యక్తి స్వాతంత్ర్యం, అందరు వ్యక్తులకూ ఒకేవిధమైన పౌరస్వత్వపు హక్కులు, పరిపాలన న్యాయశాస్త్రానికి లోబడి ఉండడం - యీ మూడింటిలోనూ ఇండియా అమెరికాల ఆదర్శాలు ఒకటే. కాని, విశ్వజనీనమయిన ఆదర్శాలను సైతం భిన్నభిన్న దేశాలు భిన్నభిన్న మార్గాల ద్వారా సాధించడానికి ప్రయత్నిస్తాయి. ఈ సందర్భంలో ఇండియా అమెరికాలకు గల అపారమైన వ్యత్యాసాన్ని గమనించవలసి ఉంటుంది. అమెరికా తక్కిన ప్రపంచం అంతటికన్నా ఎంతో అభివృద్ధి చెందింది. భారతదేశం ఇంకా వ్యవసాయాభివృద్ధికీ, పారిశ్రామికాభివృద్ధికీ ప్రణాళికలు వేసుకునే స్థితిలోనే ఉంది. వైశాల్యంలో ఆ దేశం పెద్దది, కాని జనాభా తక్కువ. స్వాతంత్ర్యం పొందిననాటి అమెరికా కంటె, స్వాతంత్ర్యంపొందిన నేటిఇండియా ఎక్కువ ఐకమత్యం కలిగి ఉంది. అయితే మన రాజకీయ చైతన్యం ఇంకా బాల్యావస్థలోనే ఉన్నది. ఒక శతాబ్దపు అత్యద్భుత కృషి ఫలితంగా, నేడు అమెరికా ప్రపంచ దేశాలలో అగ్రగామి అయింది. బహుళ ప్రాచీనమైన సంస్కృతి గల భారతదేశానికి నేడు ముందడుగు వెయ్యడానికి దారిద్ర్యం మినహా యితర ప్రోద్బలం ఏదీ లేదు.

అయినా, అమెరికా ప్రజాస్వామిక జీవితంలో అంతర్వాహినులుగా ఉన్న విశిష్టతలతో చేతులు కలిపి, ప్రపంచంలో శాంతి, అభ్యుదయం, స్వాతంత్ర్యం నెలకొల్పడానికి భారతదేశం ప్రయత్నిస్తుందని ప్రకటించడమే పండిత నెహ్రూ యాత్రా ప్రయోజనం. అమెరికా నుండి తిరిగి వస్తూ దేశాన్ని తక్షణం మార్చివేసే ప్రణాళికలు పండిత నెహ్రూ తీసుకువస్తాడనో, మన విదేశాంగ నీతిలో తీవ్రమైన మార్పులు జరుగుతాయనో ఆశించడం గాని, భయపడడం గాని అనవసరం. మన విదేశాంగ నీతి విధానాన్ని వివరిస్తూ, ప్రపంచ శాంతి, మానవ స్వాతంత్ర్యం-వీటికొరకే ఇండియా కృషి చేస్తుందని ఆయన వివరించాడు. మన జాతీయ స్వాతంత్ర్యానికి భంగకరమైన ఎట్టి విదేశ సహాయాన్నీ ఇండియా అర్థించదని స్పష్టం చేశాడు. పండిత నెహ్రూ అమెరికాపర్యటన భారతదేశగౌరవాన్ని యినుమడింప చేసింది.

# స్వయంసేవకులు : కాంగ్రెసు నిర్ణయం

కె. వి. సుబ్బయ్య

"కొండమీద నుండి పడి చావడంలోనూ, నీటిలో దుమికి మరణించడంలోనూ యెంత భేదం వుందో కమ్యూనిస్టులకు, రాష్ట్రీయ స్వయంసేవకులకీ అంతే తేడా" అని యిటీవలనే పండిత నెహ్రూ పత్రికా విలేఖరుల గోష్ఠిలో వుద్ఘాటించిన విషయం దేశం యింకా మరచిపోలేదు. ఇంతలోనే రాష్ట్రీయ స్వయంసేవక సంఘంతో జాతీయ కాంగ్రెసు నేస్తగా!

ఆర్. యస్. యస్. వారికి రాజకీయాలతో ప్రమేయం లేదు కాబట్టి జాతీయ కాంగ్రెసులోకి వారిని కూడా ఆహ్వానించవచ్చునని ఆలిండియా కాంగ్రెసు కార్యవర్గం చేసిన నిర్ణయం, ఆపైని కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు చేసిన సూచనా సిసలైన ప్రతి కాంగ్రెసువాది హృదయాన్ని కలత పరచాయి. దేశపిత బాపూజీ ఘోరహత్యను దేశం యింకా మరచిపోలేదు. అలాంటప్పుడు కాంగ్రెసు పాలకులే మరచిపోతారని యెలా అనుకో గలం? బాపూజీ హత్యతో రాష్ట్రీయ స్వయంసేవక సంఘానికి ప్రమేయం లేదంటారా? హేతువాదంతో ప్రజలకు పని లేదు. మత మహోన్మాదమే బాపూను పొట్టపెట్టుకొన్నదని ఆ బాలగోపాలం పలవరిస్తున్న విషయమే కదా!

"మా ధోరణిలో మార్పేమీ లేదు. హిందూ మతోద్ధరణే మా యేకైక లక్ష్యం. నియమావళిని మార్చుకొంటేనే, నిషేధాన్ని తొలగించింది ప్రభుత్వమని చెప్పుకోవడం భ్రమ" అని రాష్ట్రీయ స్వయంసేవక సంఘీయులు కాంగ్రెసు నాయకులను, ప్రభుత్వాన్ని యెదురు దెబ్బ తీస్తున్న విషయం ద్యోతకమవడం లేదా! ఆర్. యస్. యస్. విధానం దేశవినాశకారి అని మన నాయకులంతా ప్రవచించారు. ఎప్పుడో కాదు. సంఘంపై నిషేధాజ్ఞను తొలగించిన తర్వాతనే. ఒక విద్రోహక సంస్థ విషయంలో నెహ్రూ పండితునకు ఒక అభిప్రాయము, కాంగ్రెసు సంస్థకు వేరొక వుద్దేశ్యము వుంటుందని ఎలా వూహించగలం?

ఈ సంఘం ముస్లింలీగు, హిందూమహాసభ, కమ్యూనిస్టు సంస్థలవంటిది కాదని శ్రీ కళావారు సెలవిచ్చారు. ఏ సూత్రాల్ని ఆధారంగా తీసుకొని ముస్లిం నేషనల్ గార్డ్సును, సోషలిస్టుల ఆర్. యస్. పి. సి, మరి యితర వాలంటీరు సంస్థలనీ నిషేధించారో, అదే సూత్రాలమీద రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని నిషేధించారు. మరి నిషేధాన్ని తొలగించడానికి వారి కార్యవిధానంలో గానీ, సంఘ ధోరణిలో గాని యే మాత్రమైనా పరివర్తన కనుపించిందా? మతోద్వేగంతో ప్రజల్ని వెర్రెత్తించే మత సంస్థలకు కాంగ్రెసు హయాంలో సుస్థానం ఉంటుందని ప్రజ లెప్పుడూ భావించలేదు. మతం మానవుడికి మత్తుమందు అని నాయకులు వేదికలనుండి వూదిన సందేశాలను ప్రజ లింకా మర్చిపోలేదు. మత పిచ్చే భారతావని నైసర్గికంగా ముక్కలు చెక్కలై పోవుటకు మూలకారణమని ప్రతిరోజూ ముక్కుతూనే వున్నారు. ఇవన్నీ వట్టి మాటలే!

అసలు సంఘంపై నిషేధాన్ని తొలగించడమే అభివృద్ధి నిరోధకచర్యగా ప్రజలు భావిస్తున్నారు. అలాంటప్పుడు అనేక త్యాగాలపై నిర్మించుకొంటూ వచ్చిన జాతీయ కాంగ్రెసు సంస్థనే మతోన్మాదానికి బలిదానం చేయడమా! ఈనాడు కాంగ్రెసును అంటిపెట్టుకొని వున్న అభివృద్ధి నిరోధక శక్తుల కుద్వాసన చెప్పి కాంగ్రెసును కట్టుదిట్టంగా క్రమ శిక్షణలో కూడుకొన్న ప్రజాస్వామ్య సంస్థగా రూపొందించొద్దా? రాష్ట్రపతికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘీయులు దేశభక్తులుగా యెలా కన్పించారో బోధపడకుండా వుంది. అయినా కాంగ్రెసు క్రమశిక్షణకు, ఆశయాలకు వినాశం

కల్పిస్తున్న "ప్రోగ్రెసివ్ కాంగ్రెసు"తో చుట్టరికం చేస్తున్న వారికి ఆర్. యస్. యస్. వారిని ఆహ్వానించడానికి అభ్యంతరం లేదు.

ఇది—కాంగ్రెసులోని అభివృద్ధికరశక్తుల్ని కాంగ్రెసు సంస్థకు స్వస్తి చెప్పమని పరోక్షంగా హెచ్చరించడమేనని భావించాలా, లేక కొందరి కాంగ్రెసువాదుల స్వార్థబుద్ధితో కూడుకొన్న కుటిలనీతి అని చెప్పాలా! కాంగ్రెసు కేవలం హిందూ సంస్థ అని ముస్లింలీగు చేసిన ప్రచారాన్ని యీ చర్య సార్థకపరచడం లేదా?

ఏమైనా కాంగ్రెసు పెద్దలు మరొకమారు ఆలోచించాలి. కాంగ్రెసులోని యువకుల కిది అగ్ని పరీక్షా సమయం. కాంగ్రెసును ఎవరికి తోచినట్లు వారు స్వార్థకృష్ణకు వుపయోగించుకో ప్రయత్నించడం సహించరాదు. కాంగ్రెసు ప్రజల సంస్థ. నాయకుల క్రీడారంగం కాదు. కాంగ్రెసు చరిత్ర వ్రాసింది ప్రజలు. ఆర్. యస్. యస్. వారిని చేర్చుకొనే విషయంలో కార్యవర్గానిదే అంతిమ నిర్ణయం కాకూడదు. ప్రాథమిక సభ్యుల అభిప్రాయాన్ని తీసుకోవాలి.

కాంగ్రెసులోని యువకులు పై విషయచర్యలోని రహస్యాన్ని బద్దలు చేసేందుకు పూనుకోవాలి. లేకపోతే భారత జాతీయ కాంగ్రెస్ కూడా చైనా కొమింటాంగ్ పార్టీ వలె పరిణామం చెందగలదు. అధికార రాజకీయాలకు దిగజారిన నాయకుల విపరీత నిర్ణయాలకు వ్యతిరేకంగా వాగ్దానం ఆత్మవంచన కాగలదు. ఈ పరీక్షాసమయంలో ప్రజలు అప్రమత్తతతో ప్రవర్తించాలి.

# నవ్య కవిత్వ తత్త్వం

వసంతరావు రామకృష్ణరావు

నేటికాలంలో వెలువడుతూన్న గేయరచనలు ఆధునిక కవిత్వ తత్త్వానికి ప్రతిరూపాలు. నేటి సాహిత్యప్రపంచంలో గేయకవిత్వానికి గల ప్రభావం ఎక్కువ. నిర్దుష్టమైన భాషా పరిణామానికి గేయరచన ఉపకరిస్తుంది.

కవిత్వము సహజముగా శిల్పము. గేయకవిత్వముకూడా ఆ శిల్పానికి రూపురేఖలు ప్రసాదించే సాధనం లాంటిది. కాని ఛాందస ప్రవృత్తి గలవారు నేటి గేయ రచనా వ్యాసంగానికి తగిన ప్రోత్సాహం ఇవ్వకపోవడంవల్ల, గేయాలు నేటి సాహిత్యంలోను సంఘంలోను ప్రత్యేకత నిలబెట్టుకో లేకపోతున్నవి.

నేటి కాలపు గేయాలు ఛందస్సుతో కూడినవి కావనీ, భావప్రదర్శనలో సహజత్వము లేదనీ, భాషాగమనంలో బిగువూ బింకమూ లేవనీ చాలామంది గేయ రచనపట్ల నిరసన భావము ప్రదర్శిస్తున్నారు. ఛందోబద్ధమైన పదసముదాయముతో కూడినది కవిత్వమని కొందరి అభిప్రాయము. కాని ఈ భావము సరియైనది కాదు. నేడు వెలువడుతున్న గేయములు చాలావరకు ఆంగ్ల భాషా సంపర్కంవల్లను, సాహిత్య స్వాతంత్ర్యానికి నిదర్శనమైన స్వతంత్రతా దృక్పథంవల్లను వచ్చినవి. కాని గేయకవిత్వం ఇంతకుపూర్వము లేదని మనము చెప్పలేము.

ఈ విషయం నిరూపించడానికి ఆద్యకవిత్వం పరిశీలించాలి. పూర్వ కవిత్వము గేయరూపముగా వున్నట్లు, వేదములే మనకు నిదర్శనములు. సామవేదము గానాత్మకమైనదే. కాబట్టి గేయ రచన పట్ల అనాదరణగలవారు గేయాలప్రతిభ పూర్వకాలపు టంకారక జాతులందు విశిష్టముగా పని చేసినదో తెలిసికొనుట అవసరము. నేటికిని ప్రాకృతుల ఆచార వ్యవహారములలో గేయ గానం మనకు వినిపిస్తుంది. భావోద్రేకం ఫలితంగా, అప్రయత్నంగాను, సుకరంగాను, నిర్దుష్టంగాను వెలువడే కవిత్వాన్ని గేయ కవిత్వంగా నిర్వచించవచ్చును. ఈ విధమైన రచనా విధానానికి గణయతిప్రాసాదులు అడ్డురావు. వీటిలో భావం పదాలను ఆకట్టుకొంటూ నడుచుకు పోతుంది. అందువల్ల గేయానికి భావము

ప్రధానం — భాష కూడా సులభగ్రాహ్యంగా ఉండాలి. కఠినపదాల ప్రయోగాలు గేయ కవిత్వంలోని సునిశిత భావాన్ని పాడుచేస్తాయి. అయితే, నేటి గేయాలలో జాతీయతా చిహ్నమైన పదాలు, దేశ్యపదాలు ఉపయోగింపబడటం లేదు.

కవిత్వానికి ప్రయోజనం సాధించాలంటే కావ్యకళాదృక్పథం అవసరం— శైలి, ఛందస్సు, రసపుష్టి, మొదలగునవి అలంకార ప్రాయాలు. సాహిత్యసాంప్రదాయాన్ని అనుసరించి కవితా ప్రభావం వికసించాలంటే కవికి ప్రతిభ, వ్యుత్పత్తి ఉండాలి. సమగ్ర మనోవైభవాన్ని ప్రదర్శించేది ప్రతిభ. ఇక వ్యుత్పత్తి అనగా బహు గ్రంథ పఠన సాధ్యమైన పాండిత్యము. కనుక ప్రతిభా సమన్వితమైన కవిత్వమే, నేటి గేయ రచనకు అవకాశం కలిగిస్తున్నట్లు మనకు స్పష్టపడుతుంది.

నేటి సాహితీ ప్రపంచంలో కవి యొక్క వ్యక్తిత్వానికి, వస్తువు యొక్క అనురూపతకు, ప్రజ్ఞకు గేయరచన ప్రాతినిధ్యం వహిస్తుంది. నిర్దుష్టమైన భాషాపరిణామానికి, రూపురేఖలు దిద్ది ప్రజాజీవితంలో సంచలనం తేడానికి గేయ రచన అవసరం— గేయరచయితల అభ్యుదయ భావాలకు, రచనలకు తగిన పోషణ లభించాలి.

కవిత్రయంలో పేర్కొనదగిన తిక్కన కవి బ్రహ్మ, ప్రతిభావ్యుత్పత్తులు గలవాడగుటచే, ఛందోబద్ధమైన కవిత్వమునందు జాతీయ దేశ్య పదములను ప్రయోగించెను. కాని బుద్ధిబలము పొంచి, భావశక్తి స్వతంత్ర స్వరూపములలో వెలువడుచున్నది. ప్రజల విశ్వాసములు, అభిప్రాయములు మారుటచే భావనావ్యాపారమైన కవిత్వములో, నవ్యపద్ధతులు కనుపించుచున్నవి. అట్టివాటిలో భావశక్తినీ, సాహితీ శిల్పాన్ని ప్రదర్శించునవి కథానికలు, గేయములు.

భావోత్కర్షమును వెలిబుచ్చుటయే కవిత్వము అను అభిప్రాయము, ఆంగ్లకవులైన వర్డ్సువర్తు, షెల్లీ వెల్లడిచేశారు. కార్లయిల్, గానాన్వితమైన భావప్రదర్శన కవిత్వమని చెప్పెను. కాబట్టి గేయము మాత్రము కవిత్వ మేల కాదు?

కాబట్టి, గేయకవిత్వములోని శిల్పవిశిష్టతను గుర్తించి చక్కని భాషాగమనం, భావప్రభావం గల గేయాలు రచించవలసిన బాధ్యత నేటి సాహితీపరుల ప్రధాన ఆశయమై ఉండాలి. గేయరచనకు మాత్రా ఛందస్సును సాధనంగా గ్రహించుకోవడంకూడా అవసరం కాని గురజాడవారు చూపినమాత్రా ఛందఃప్రయోగాన్ని నేటి కవులు అనుసరించుటలేదు. శ్రీ శ్రీ, మల్లవరపు మొదలైనవారు మాత్రం, మాత్రా ఛందస్సు ప్రయోగించి వింతగమనం ప్రదర్శించారు.

ఉత్తమోత్తమైన గేయ కవిత్వానికి అభివృద్ధి మార్గం చూడాలి. గేయరచనకు ఉద్వేగమూ, ఉరవడీ- రెండూ ఉండాలి. అప్పుడే గేయాలకు వింతగమనం వస్తుంది.

ఈ యుగంలో దేవుడు మనకి ప్రత్యక్షమైతే ఏం జేస్తామో నిస్సందేహంగా చేసి చూపించాము. గుండెలు చీలుకుపోయేలాగ యేడిపిస్తాము; గుండుతో పేల్చి చంపేస్తాము! ఆ తరువాత అవినీతి పరులమూ, అసమర్థులమూ చేరి, గుండెలు తీసిన బంటులమై, నిశ్చింతగా ఆయనపేరుతో అక్రమపరిపాలన సాగించేస్తాము!—పా

అభిప్రాయ వేదిక:

# ఏది అభ్యుదయ సాహిత్యం?

తెలుగు స్వతంత్ర
అక్టోబర్-21-1949

కొడవటిగంటి కుటుంబరావు

పై శీర్షికతో అక్టోబరు 14 "తెలుగు స్వతంత్ర" లో శ్రీ కొత్తపల్లి రంగారావు గారు ఈ కింది సిద్ధాంతాన్ని ఉపపాదించారు.

"ప్రజల కొక అడుగు ముందుండి, వారి పరిస్థితులనూ సమస్యలనూ అర్థంచేసుకొని, వారికి సరిఅయిన మార్గాన్ని చూపిస్తూ, ఉద్బోధాన్నీ ఉత్తేజాన్నీ కలిగించి కర్తవ్యోన్ముఖుల జేసి, పాత వ్యవస్థలను ధ్వంసంగావించి వాటి శిథిలాలపై నూతన సమాజ నిర్మాణాన్ని గావించడానికి పురికొల్పేదే అభ్యుదయ సాహిత్యం. అదే నిజమైన ప్రజాసాహిత్యం."

అభ్యుదయ సాహిత్యంయొక్క ఆశయాలకు సంబంధించినంతవరకు నేను శ్రీ రంగారావు గారితో ఏకీభవిస్తాను. కాని ఎవరన్నా నన్ను గాని శ్రీ రంగారావుగారినిగాని నిలవేసి, "ఇటువంటి ఆదర్శాలు గలిగిన ఒక గేయంకాని, కథ గాని, నాటకంగాని చూపండి," అంటే చూపలేకపోవచ్చు. దానికి కారణం ప్రధానంగా ఏమంటే పైనచెప్పినది అభ్యుదయ సాహిత్యంయొక్క సమష్టి ఆశయం. ప్రతి అభ్యుదయ రచనలోనూ ఇన్ని ఆశయాలూ గూడుకట్టుకుని ఉండాలంటే అభ్యుదయ రచన దాదాపు అసాధ్య మవుతుంది. గోర్కీ రచనలుకూడా పరీక్షకు నిలబడవు.

పై నిర్వచనాన్ని కొంచెం వివరంగా పరిశీలించితే ఏమి తేలేదీ చూద్దాం.

పై సిద్ధాంతానికి అనుగుణంగా రాజకీయాలకు సంబంధించిన రచనలు రచించటం చాలా సులభం. వాటి విషయం నేనిక్కడ ఎత్తుకోను. అచ్చగా సాహిత్యం విషయమే తీసుకుందాం.

అభ్యుదయ సాహిత్యం ప్రజల సమస్యలనూ, పరిస్థితులనూ అర్థం చేసుకోవాలి. ఇదికూడా అభ్యుదయ రచయితలు సులభంగా చేయగల పనే. ప్రజా జీవితానికీ, ప్రజల ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులకూ అంతరాయంగా ఉన్నది వర్గదోపిడీ విధానమనీ, అది నశిస్తేగాని ప్రజా జీవితం అనవరోధంగా సర్వాంగ శోభితంగా అభివృద్ధి కాదనీ, ప్రజా జీవితం ఒక్క అడుగు ముందుకు వేయకుండా ఉండగలందులకు పై వర్గాలవారు తమ యావచ్ఛక్తులనూ-బుద్ధిబలంతో సహా- ఉపయోగిస్తారనీ అభ్యుదయ వాదులు తప్పక గుర్తిస్తారు.

కాని ఈ విషయాన్ని సాహిత్యంద్వారా ప్రజలకు తెలియపరుస్తూ వారికి "సరియైన మార్గం చూపిస్తూ ఉద్బోధనా ఉత్తేజమూ" కలిగించటం సులభమైన పని కాదు. తుడిచిపెట్టిన పలకమీద ఏమైనా రాయవచ్చు. ప్రజల మనస్సులు తుడిచిన పలకలు కావు. "మీ సమస్య ఇది. ఈపని చేస్తే మీరు పైకి వస్తారు." అని చెప్పినంతమాత్రంచేత ప్రజలు పైకి రాలేరు. వారి వర్గ వాసన పూర్తిగా అర్థంచేసుకోకుండా, వారి జీవితాలలో పాలు పంచుకోకుండా, వారి అజ్ఞానాన్నీ మౌఢ్యాన్నీ అవగాహన చేసుకోకుండా, వారి మనస్తత్వాన్ని తూచకుండా వారితో పై విషయాలు అనలేము. ఇందులో మనస్తత్వ పరిజ్ఞానానికీ, శిల్పానికీకూడా ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఈ ప్రాముఖ్యాన్ని శ్రీ రంగారావుగారు ఖాతరుచెయ్యక, ఇది సులభమైన పని కాదన్న వారందరూ ఎస్కేపిస్టులనీ, ప్రభుత్వానికి వెరిచిన వారనీ అనేటట్టయితే దాని కెవరు బాధ్యులు?

కేవలం తీర్మానం వున్నంత మాత్రంచేత ఏ మధ్యతరగతివాడు గాని ప్రజాసామాన్యాన్ని యథార్థంగా ఉత్తేజపరిచే రచనలు చేయలేడని నేను నొక్కి వక్కాణించగలను. వర్గసంస్కృతి దానికి అడ్డం వస్తుంది. వర్గసంస్కృతి పుట్టుకతో రాదంటే ఒప్పుకుంటాను గాని అది కృషివల్ల మాత్రమే పోతుందంటే నేను ఒప్పుకోను. వర్గసంస్కృతికి భౌతిక జీవితాధారాలతో గల-

పారమ్పర్యాన్ని శ్రీ రంగారావుగారు మరువ రాదు.

పై నిర్వచనలో "పాత వ్యవస్థను ధ్వంసం కావించటం" అనే అంశ మొకటి ఉన్నది. ఇది కూడా అభ్యుదయ సాహిత్యం ఆశయాలలో ఒకటి. సాంఘికాభ్యుదయం చేకూరే పరిణామంలో ఇప్పుడున్న వర్గాల స్వరూపమూ, వాటి సంబంధాలూ కూడా మారతాయని నేను శ్రీ రంగారావుగారికి వేరే చెప్పవలసిన అవసరం ఉండదు. మధ్యతరగతి విశ్వాసాలలోనూ మానసికమైన అలవాట్లలోనూ పరిణామ ఫలితంగా "పుచ్చు" ఏర్పడుతున్నది. ఈ "పుచ్చు" ను ఎత్తిచూపటం, దానిమీద దెబ్బ కొట్టటం అభ్యుదయ లక్షణం ఎందుకు కాదు? అంతమాత్రం చేత అటువంటి రచనలన్నీ ప్రజాసాహిత్య మవుతాయా? అయేపక్షాన నేను రాసిన అనేక కథలు ప్రజాసాహిత్యం అయిఉండాలి. శ్రీ రంగారావుగారు వాటిని ప్రజాసాహిత్యమన్నా నేను అనటానికి సిద్ధంగా లేను. కాని అవి అభ్యుదయ రచనలు మాత్రం అవును.

ఒక మార్కిస్టు ఈ విధంగా అన్నాడు:

"వర్గవ్యవస్థ ముదురుతున్న కొద్దీ కళాకారుడికీ ప్రజాసామాన్యానికీ మధ్య ఒక అఖాతం ఏర్పడుతుంది. సామ్యవాద పద్ధతిపై సాంఘిక వ్యవస్థ నిర్మాణమైన మాత్రంచేత కూడా ఈ అఖాతం పోదు. కాని ఇది పోవటానికి సామ్య వ్యవస్థ ఏర్పడటం కనీస షరతు."

శ్రీ రంగారావుగారు చెప్పే మాటకూ ఈ పై సిద్ధాంతానికీ చాలా వ్యత్యాసం కనిపిస్తున్నది. అనుభవాన్ని బట్టి పై సిద్ధాంతంలో కొంత నిజం ఉన్నట్టుగా కూడా కనిపిస్తున్నది. ఒకనాడు నన్నయభట్టూ, అంతకన్న కూడా తిక్కనసోమయాజీ రాసిన భారతమూ, మరొకనాడు బమ్మెర పోతరాజు రాసిన భాగవతమూ ప్రజాసాహిత్యమైనంతగా ఈనాటి మధ్య తరగతి రచయితలు సృష్టించే సాహిత్యం ప్రజాసాహిత్యం కాలేకుండా ఉంది. మధ్యతరగతికీ శ్రామికులకూ మధ్య ఉన్న ఎడం ఆనాటికీ ఈనాటికీ అనేకరెట్లు పెరిగింది. ఈ భేదం పోవాలంటే కళాకారులు శ్రామికవర్గంయొక్క వర్గ లక్షణాలు పైపైన అలవరచుకొని కృత్రిమ ప్రజాసాహిత్యం రచించి లాభం లేదు. కళాకారులు తమ వర్గసంబంధాలన్నిటినీ తెంచుకుని శ్రామిక జీవితం అలవరచుకుని, వారి మనస్తత్వం తెచ్చి పెట్టుకుని కళాసృష్టికి పూనుకోవాలి.

లేదా, కళాకారులు తమ వర్గానికే జవాబుదారీ వహించి ఆ వర్గాన్ని అభ్యుదయ పరిణామానికి అనుకూలంగా మార్పు చెందించడానికి సాహిత్యం ద్వారా కృషిచేస్తూ, ఆ వర్గం శ్రామిక వర్గానికి సన్నిహితంగా పరిణామం చెందుతున్న కొద్దీ తాము కూడా శ్రామిక వర్గానికి దగ్గిరిగా రావాలి. ఇదే సరి అయిన పద్ధతి అనీ, సాంఘిక విప్లవానికి పూర్వదశలో ఈ పద్ధతికి అర్థం ఉన్నదనీ నా విశ్వాసం.

ఇటువంటిదే విప్లవానంతర దశలోకూడా కనిపిస్తుంది. దీనికి జోష్చెంకో పై వెలలేసిన దుమారంలోనుంచి ఒక ఉదాహరణ ఇస్తాను. జోష్చెంకో సమర్థుడైన రచయితే గాని క్షుద్రమైన మధ్యతరగతి పాత్రలనుగురించి హాస్య ధోరణిలో కథలు రాశాడు. అప్పుడే అంతమైన సామాజిక వ్యవస్థను చిత్రించడానికి ప్రయత్నిస్తున్నాడని కొందరు విశ్వసించారు. కాని ఎంతకూ అతను రష్యా ప్రజాజీవితంలో కలిగే నూతన వికాసాన్ని గురించి రాయలేదు. "ఈ మనిషి గతించిన క్షుద్రజీవితాన్ని గురించి రాయటం లేదు. అతనే స్వయంగా ఆ క్షుద్రమైన మధ్యతరగతి పాత్ర," అని విమర్శకులు తీర్పు చెప్పారు. ఏ దృష్టితో జోష్చెంకో రచనలను కొంతకాలం రష్యాప్రజలు సహించారో, ఎందుచేత జోష్చెంకో కొంతకాలం గొప్ప రచయితగా పరిగణన పొందాడో మనం గ్రహించాలి. నూతన సమాజనిర్మాణానికి తోడ్పడక పూర్వం అభ్యుదయ సాహిత్యం పాత సమాజాన్ని నిర్మూలించటానికి తోడ్పడవలసి ఉంటుంది. ఈ దశలో మధ్యతరగతి నిర్వహించే అభ్యుదయ నిరోధక పాత్రను ఆ తరగతిలోని అభ్యుదయ వాదులు బట్టబయలు చేయవలసి ఉంటుంది.

ఇక ప్రజాసాహిత్యాన్ని తీసుకుంటే, అది అభ్యుదయ సాహిత్యం కాదని నేననలేదు. డయలెక్టిక్సు తెలిసిన శ్రీ రంగారావుగారు, నేను ప్రజాసాహిత్యమూ అభ్యుదయ సాహిత్యమూ వేరు

చేరని భావించి ఊంటూ ననుకోవలసిన అవసరం లేదు. ప్రజాసామాన్యం తన ప్రత్యేక సాహిత్యాన్ని ఎప్పుడూ సృష్టించుకొంటూనే ఉన్నది. కాని సామాన్యప్రజలు త్రైవర్గాల సంస్కృతి నుంచి విడివడే కార్యక్రమం చాలా మెల్లిగా జరుగుతున్నది. వర్గవ్యవస్థ ముదిరిన కొద్దీ ఇది మరింత చురుకుగా జరుగుతుంది.

అభ్యుదయ రచయితల సంఘం ప్రోత్సాహంతో ఆంధ్రప్రజానాట్యమండలివారు కొన్ని బుర్రకథలూ, కూచిపూడి భాగవతాలూ, ఇతర ప్రదర్శనాలూ తయారుచేశారు. "ముందడుగు", "మాభూమి" నాటకాలాడారు. ఈ న్వరూపాలన్నీ ప్రజలకు చాలా సన్నిహితంగా వెళ్లిలక్ లాంటి ప్రజానీకానికి ప్రజాసాహిత్యం చదివిచూపిస్తె. అదే "అభ్యుదయ" పత్రికలో వెలువడిన వ్యాసాలూ, కథలూ చూసినట్లయితే అవి ప్రజాసాహిత్యం అనిపించుకోలేదు. అంతమాత్రం చేత అవి అభ్యుదయ సాహిత్యం కాకనూ పోలేదు. నిజమైన ప్రజాసాహిత్యం ప్రజలలో నుంచీ, వారిలో కలిగే చైతన్యంలోనుంచీ ఉత్పత్తి కావలసి ఉన్నది. మధ్యతరగతి వాళ్ళు కృత్రిమ ప్రజాసాహిత్యం సృష్టి చేయవచ్చు. కాని దానితో ప్రజలను ఉత్తేజపరచటంమటుకు సులభం కాదు.

# రాజకీయాలు : నైతికప్రమాణాలు

జి. సాంబశివరావు

సెప్టెంబరు 30-వ తేదీ "తెలుగు స్వతంత్ర"లో "నేటి రాజకీయవాది-నైతిక ప్రమాణాలు" అను శీర్షికతో నొక వ్యాసము ప్రచురించబడినది. అందులో రచయిత నేటి రాజకీయవాదియొక్క నైతిక పతనమునకు, దానివలన ప్రజలకు కలుగుచున్న బాధలకు విచారించిరి. రాజకీయవాదియొక్క మనోవాక్కాయ కర్మలయందు దేమాత్రము పరస్పర విరుద్ధము ఉండరాదని వాకొనిరి. తుదకు "వాదము లెంత విలువగలవైనను... నైతిక విలువలయొక్కయు, ధర్మవాదముయొక్కయు ప్రాముఖ్యమును గుర్తించరిరో... నేటి రాజకీయ విధానములపై ఆధారపడిన వ్యవస్థలన్ని చీట్లపేక మేడలవలె కూలిపోక తప్పదు!" అని తెగవేసి చెప్పిరి. హృదయపూర్వకముగ మానవ శ్రేయస్సును కోరు ప్రతివారు దీనినే చెప్పుచున్నారు. వారిలో కొందరు స్వీయాచరణముచే ఆరాధ్యులగుచున్నారు కూడ. కాని నైతిక వాదరీత్యా 'గ్రుడ్డిలో మెల్లవలె కమ్యూనిస్టు... రాజకీయములు కొంతకు కొంత ప్రోత్సాహజనకముగ నున్న" వనుట మిక్కిలి వింతగొల్పుచున్నది. అంతియేగాక వారి వ్యాసములో ఏ నైతికసూత్రములు చెప్పబడినవో వానినే ఖండించినటుల యగుచున్నవి. నైతిక వాదరీత్యా కమ్యూనిస్టు రాజకీయములు కాంగ్రెసు మరియు యితర వామపక్షముల రాజకీయములకంటె ఏవిధముగ "గ్రుడ్డిలో మెల్లవలె" నున్నవో తెలుపలేదు. అందువలన వారిదృష్టిలో నైతిక ప్రమాణాలకు ప్రత్యేకార్థ మేమైన యున్నదా? లేక దానియందుండెడి పక్షపాతము వారి నటుల వ్రాయుటకు ప్రోత్సహించినదా?

ప్రపంచములో గ్రుడ్డి కంటివారివలన వారికే ఇబ్బందికలుగును గాని, మెల్లకంటివారివలన యితరులకు యిబ్బంది కలుగుచుండును. కొన్ని సమయములలో వారిచూపులచే పొరబడుటకును లేక వారిచే మోసగించబడుటకును కూడ అవకాశమున్నది. అందువలననె గ్రుడ్డికంటివంటి రాజకీయములుగల యితర పక్షములనుండి జాగ్రత్తపడుటకు అవకాశముండి- గ్రుడ్డికన్నుగాని, మంచికన్నుగాని కమ్యూనిస్టు రాజకీయములవలన ప్రజలు పొరబడి, మోసగించబడి, బాధించబడుచున్నారు.

అసలు అనాదికాలమునుండి రాజకీయ శాస్త్రమునకు నైతిక ప్రమాణాలకు సంబంధ మెంతకంత గానే యున్నటుల కనుపించుచున్నది. పురాణ కాలమునుండి నేటివరకు వచ్చిన ఏ రాజకీయ

చివరనున్న అరుగు వరకూ తడుముకుంటూ వెళ్ళి అక్కడ కూర్చుంది. దారే పోయే వాళ్ళంతా చాలా సానుభూతి కనబర్చారు పెదవులమీద.

“పాపం, ఎంత అందగత్తె! అన్ని అవయవాలూ తీర్చిదిద్దినట్టుగా వున్నాయి. కాని దయామయుడయిన ఆ విధాత కళ్ళవిషయంలోనే ఇంత నిర్దయ కనపర్చాడు. పాపం! ఆ అమ్మాయి ఎవరో మర్యాదస్థుల బిడ్డల్లేనే వుంది. ఆమె గతేం కానుందో” అని బుగ్గలు నొక్కుకుని, వేళ్ళు ముక్కుమీద వేసుకుని, పై గుడ్డలతో కళ్ళు తుడుచుకుని, నుదుటిమీద వేలితో ‘కర్మ’ అంటూ అడ్డంగా రాసుకుని వెళ్లిపోసాగారు.

అవే మాటలు అంటూ అక్కడే కూర్చుంది. అంతా వస్తున్నారు, చూస్తున్నారు, పోతున్నారు. ఫలానివారి పిల్లని గుర్తుపట్టినవారు ఉన్నప్పటికీ మన కెందుకని ఊరుకుని వెళ్ళిపోయారు మానవమాత్రులని అనిపించుకునే వారంతా. ఆమె కంఠంలో దైన్యమూ, ఆవేదనా, ఆక్రోశమూ పేరుకుని పేరుకుని, కదలలేక కదలలేక అస్పష్టంగా వినిపించసాగాయి కొద్దిసేపయాక ఆమె మాటలు.

అతనెంత సేపట్నుంచి మీనాక్షిని చూస్తున్నాడో ఎవరూ గ్రహించలేదు. అందరితో పాటు అతనూ చూస్తున్నాడు. దీనాతిదీనమైన ఆ కంఠధ్వని అలాగే ఆ రణగొణ ధ్వనిలో ఒక మూలుగు శ్రుతిలా వినిపించింది అతనికి.

అతనిలో అనేక ప్రశ్నలూ సమాధానాలూ బయల్దేరినయి. తనలో తను అనుకున్నాడు. ఇదంతా ఒక విధి విధానము. సృష్టికర్త అంత అందాన్ని ఇచ్చినా దృష్టి విషయంలో తన సంకుచిత దృష్టిని దృఢంగా వ్యక్తపర్చుకున్నాడు. లేకపోతే బలీయమైన ఆమె పూర్వజన్మ పాపము పరిపక్వమై ఆమె నా స్థితికి తీసుకునివచ్చి వుంటుంది. దురూహ్యమైన, ఊహాతీతమైన శక్తులు నిర్మించిన ఈ ప్రపంచపు మంచిచెడ్డలని గురించి మనం ఎంత తల మొత్తుకుంటే ఏం లాభం, ఏం ప్రయోజనం అనుకుని సంతృప్తి పడితే లాభం లేదు. మంచివారికి మంచివారు సహాయం చేయటం గొప్పలో జమ కాదు. అది కేవలం తమ సుబుద్ధిని వ్యక్తపర్చటమే. ఇట్లాంటి వారికి సహాయం చేసినందువల్ల పరమాత్మ మెచ్చటమే గాకుండా ఆమె కని విని ఎరుగని, మనస్సు కందని సంతోషదాయకమైన సహాయము చేసినవాడ నవుతాను. కాబట్టి తప్పదు. ఎవరే మనుకొన్నా ఆ జీవికి అమిత సంతోషాన్ని చేకూరుస్తాను, మొదటి విషయం. అటువంటి వ్యక్తిని చేరదీశాను కదా అని నా మనస్సుకు నేను అమితంగా సంతోషపెట్టటం, రెండవది. మూడవది, భగవంతుని దృష్టిలో ఇటువంటి వారికి సహాయం చేసినందువల్ల తప్పకుండా ఉంటాననే ధైర్యం నాకుంది. అని ఆలోచించుకుని ఒక దృఢ నిశ్చయాని కొచ్చి ఒక్క వేడి నిట్టూర్పు విడిచి మెల్లిగా అరుగు దగ్గరకు వెళ్ళాడు.

“అమ్మాయీ, నీ పేరు?”

“మీనాక్షి.”

“మీనాక్షీ నాతో వస్తావా?”

“ఎందుకండీ నన్ను ఎగతాళి చేస్తారు? మీ దార్ని మీరు పొండి.” అన్నది నిరాశగా.

“లేదు, పరమాత్మ సాక్షిగా చెబుతున్నాను.”

“మీకే అంధదీనురాలిమీద అంత దయ కలుగుతే నాకు దృష్టి వచ్చిందని తెల్సినప్పుడు కలిగే సంతోషం కన్నా ఎక్కువ సంతోష పడుతున్నాను. తప్పక వస్తాను” అంది సంతోషంతో, మెల్లిగా నవ్వుతూ. ఆనవ్వులో అమితానందం తొణికిసలాడింది. ముత్యా లొలికినట్లనిపించింది అక్కడివారికి. రెండు నిమిషాల్లో గుట్టుంబండి తీసుకొచ్చాడతను.

“మీ రెవరోగాని చాలా ఉదారస్వభావులు, లేకపోతే నాగతి ఏమయివుండేదో?”

“వర్ణాంతర వివాహం చేసుకోటానికి అసలు నేనే అంగీకరించను. ఇంక ఉదారస్వభావమనేది భగవత్ప్రేరితము” అన్నాడు నవ్వుతూ.

సంవత్సరన్నర గడిచిపోయింది. మేలి ముసుగుతో, నడికట్టుతో, కాళ్ళకు పసుపు పారాణులతో, చెవుల్లో దూదితో, తాంబూలపు రక్తిమ వర్ణముతో పెదవులు ముద్దు లొలుకుచుండగా పొత్తిళ్ళల్లో పిల్లవాణ్ని పెట్టుకుని, ముత్యా లొలుకు నవ్వుతో వచ్చి-

“ఏమండీ, అంతా పిల్లవాడు అచ్చంగా మీ పోలికే అంటున్నారు - నిజమేనా చూడండి” అన్నది.

"నిజమే, కాని కష్టమాత్రం నాదికాదు-నీది" అన్నాడు ఎగతాళిగా.

"ఆఁ, నిజమే! అయితే వీడూ గుడ్డివాడైపోడా!" అంది ఆదుర్దాగా,విచారంగా. ఓకపకా నవ్వి- "ఎగతాళిగా అన్నాను మీనా, మనిద్దరి పోలికా వాడిలో మూర్తీభవించి వున్నది" అన్నాడు.

"నిర్భాగ్యురాల్ని కన్నబిడ్డను తడివిమాసి సంతోషించవలసిందేగాని వాడి ఆటపాటలూ, ముద్దు ముచ్చటలూ కళ్ళారాచూసే యోగం లేకపోయింది కదా" అని విచారపడింది.

"మీనా విచారపడకు, నేను చూస్తుంటాను కదా. వాడికి ఏలోపమూ రాదు. ఏదీ ఒక్కసారి నవ్వు" అన్నాడు. ఆమె ఉన్నట్టుండి నవ్వింది.

"అబ్బ, ఎంత బావున్నావు మీనా. కళ్ళు లేకపోవటంకూడా ఒక విధమైన అందాన్నిచ్చింది. ఏదీ..." ఆమె తాంబూల మిళితమైన పెదవులను చుంబించపోతుంటే మధ్య తను నలిగిపోతానేమో అనుకుని ఆ పసికందు క్యారు మన్నాడు.



మెంగసాల ప్రోత

# పౌరస్వత్వాలు : కమ్యూనిస్టులు

మోపర్తి వెంకటరమణయ్య

మద్రాసు ప్రభుత్వం రాష్ట్రంలోని కమ్యూనిస్టు పార్టీని, దాని అనుబంధ సంస్థలను నిషేధించటంతో మళ్లీ పౌరస్వత్వాల సమస్య తలయెత్తింది. ప్రభుత్వ చర్య శాంతిభద్రతల రక్షణకు అనుగుణంగా ఉన్నదంటూ కొందరు సమర్థిస్తూంటే; మరికొందరు పౌరస్వత్వాలపై గొడ్డలిపెట్టని, ప్రజాస్వామ్య విరుద్ధమని ఖండిస్తున్నారు. వీరి వాదోపవాదాలను పరికిస్తున్న సామాన్య ప్రజలకు యేది ప్రజాస్వామ్యబద్ధమో, యేది ప్రజాస్వామ్య విరుద్ధమో అర్థంకాక అసలు పౌరస్వత్వాల సమస్యే అయోమయంగా కనబడుతున్నది. ఇట్టితరిలో కమ్యూనిస్టుల విషయంలో పౌరస్వత్వాలు యెంతవరకు అనువర్తించునో పరిశీలించటం అవసరం.

ప్రజాస్వామ్య విధానానికి పౌరస్వత్వాలు ప్రాణసమానమైనవి. ఏ ప్రభుత్వమైనా యెంత వరకు ప్రజాస్వామ్యమైనదీ అది ప్రజలకు ప్రసాదించే హక్కులపై ఆధారపడి ఉంటుంది. పార్టీ స్వాతంత్ర్యము ముఖ్యమయిన హక్కులలో ఒకటి. ప్రతి పౌరునకు తనకు యిష్టమైన పార్టీలో చేరటానికి, ఆ పార్టీ ప్రజలలో వ్యాప్తి చెంద చట్టసమ్మత పద్ధతుల ద్వారా కృషి చేయటానికి గల హక్కు గుర్తించబడింది. అయితే యీ హక్కులతోపాటు పౌరులు నిర్వర్తించవలసిన విధులు కూడా కొన్ని ఉన్నవి. పై హక్కులను అనుభవించే ప్రతి రాజకీయ పార్టీ కూడా ప్రభుత్వము యెడల, యితర రాజకీయ పార్టీల యెడల తాను నిర్వర్తించ వలసిన విధులను గుర్తించి తన కార్యక్రమాలను కొనసాగించవలసి ఉంది. ప్రజాస్వామ్య సూత్రాలకు బద్ధమైన ప్రతి పార్టీ తన రాజకీయ కార్యక్రమాలను శాంతియుతంగా, చట్టసమ్మత పద్ధతులద్వారా కొనసాగిస్తూ - యితర ప్రజల లేక పార్టీల హక్కులకు యేవిధంగానూ భంగం కలిగించకుండా పనిచేయవలసివుంది. ప్రభుత్వము నుండి ప్రజాస్వామ్యపుహక్కులు పొందుతున్నంత వరకు ప్రభుత్వాన్ని ప్రతిఘటించే విషయంలో కూడా ప్రజాస్వామ్యవిధానాలనే అనుసరించాలి. ప్రజాస్వామ్య సూత్రాలను ఉల్లంఘించే పార్టీకి ప్రజాస్వామ్య స్వత్వాలను పొందే అధికారం ఉండరాదు. ఈ సూత్రాన్ని కమ్యూనిస్టు పార్టీకి అన్వయించి చూస్తే సమస్య తేలికగా బోధపడుతుంది.

కమ్యూనిస్టులు ప్రజాస్వామ్య వాదులని వారి సిద్ధాంతాలు, కార్యక్రమాలు తెలిసినవా రెవరూ అంగీకరించజాలరు. సాయుధ విప్లవము, కార్మిక

నియంతృత్వము లక్ష్యాలుగాగల కమ్యూనిస్టులు ప్రజాస్వామ్య వాదులు ఎలా అవుతారు? పైగా కమ్యూనిస్టు దేశాలలో ప్రజలకు వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము మొదలయిన పౌరస్వత్వాలు లేకుండా చేస్తున్నారు కదా! మరి తమ ప్రభుత్వంలో యితర ప్రజలకు ఉండని హక్కులు యితరుల ప్రభుత్వంలో తమకు ఉండాలనటం అసంగతం కాదా? అంటే కమ్యూనిస్టు దేశాలలో ప్రజలకు పౌరస్వత్వాలు అనుమతించటంలేదు కాబట్టి, ప్రతిక్రియగా ఇతర దేశాల్లోని కమ్యూనిస్టులకు పౌరస్వత్వాలు యివ్వరాదని భావం కాదు. తాము యితరులకు అనుమతించని సదుపాయాలు, యితరులు తమకు అనుమతించాలనే కమ్యూనిస్టుల కోరికను నైతికంగా ఎలా సమర్థించవచ్చునన్నదే ప్రశ్న. దీనికి జవాబుగా కమ్యూనిస్టులు తాము మాత్రమే ప్రజాహితులనీ, తదితరులందరూ ప్రజాశత్రువులనీ సిద్ధాంతం బయలుదేర తీశారు. యథార్థమేమంటే ప్రజాస్వామ్యదేశాలలోని రాజకీయ స్వేచ్ఛను అవకాశంగా తీసుకొని ప్రభుత్వాన్ని కూలద్రోయటమే కమ్యూనిస్టుల యెత్తు. పౌరస్వత్వాలను ఉపయోగించుకొని తమ అరాజక కృత్యాలను యినోధికం చేయటమే వారి పన్నుగడ. అందుకనే అందరికంటేముందు పౌరస్వత్వాలకు ప్రమాదం సంభవించిందని గోలపెడతారు; అంతే కాని వారికి నిజంగా పౌరస్వత్వాలంటే శ్రద్ధ ఉండిమాత్రం కాదు.

కమ్యూనిస్టులు అటు ప్రభుత్వానికేగాక, యిటు యితర పార్టీలకుకూడా ఉపద్రవకరంగా పరిణమించారు. ప్రత్యర్థులను వాదబలంతోగాక, దౌర్జన్యంతో యెదుర్కోటమే వారికి మామూలు. తమకు సంఖ్యాబలమున్న ప్రదేశాలలో యితర పార్టీల వారిని నానాహింసలూ పెడుతున్నారు. హత్యచేయటానికికూడా వెనుకాడటంలేదు. ఇట్టి పరిస్థితులలో యే ప్రజాస్వామ్యవాదీ కమ్యూనిస్టులను సమర్థించజాలడు. మద్రాసు ప్రభుత్వంవారు కమ్యూనిస్టు పార్టీని నిషేధించగానే అఖిలభారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘమువారు దేశంలోని ప్రజాస్వామ్యవాదులందరును ప్రభుత్వ చర్యకు అసమ్మతి తెలుపవలసిందని విజ్ఞప్తి చేశారు. కాని ప్రజాస్వామ్య సిద్ధాంతాలను ఉల్లంఘిస్తున్న కమ్యూనిస్టులకు ప్రజాస్వామ్యపు హక్కులను యివ్వవలెనని యెవరు చెప్పగలరు? తమ దౌర్జన్య కార్యక్రమాలను విరమించుకొని శాంతియుతంగా పని చేయనంతవరకు కమ్యూనిస్టులకు పౌరస్వత్వాలను కోరే హక్కు లేదు.

ఇక ప్రభుత్వమువారిచర్యను కూడా పూర్తిగా సమర్థించ వీలులేదు. మన ప్రభుత్వంవారు పౌరస్వత్వాల యెడల చూపే ప్రేమ కూడా సవతితల్లి ప్రేమగానే ఉన్నది. ప్రభుత్వంవారు పౌరస్వత్వాలను గౌరవించకపోతే అరాజకవాదుల కృత్యాలకు చక్కని సాకు కలిగించినవారవుతారు. అప్పుడే యితర పార్టీలవారు కూడా తమ స్వేచ్ఛను ప్రభుత్వం అరికట్టుతుందేమో నని సంకోచిస్తున్నారు. ప్రజాస్వామ్య సూత్రాలను పాటించి శాంతియుతంగా పని చేసే రాజకీయ పార్టీల స్వాతంత్ర్యానికి భంగం కలిగించమని ప్రభుత్వంవారు మాటలలోనే గాక చేతలలో కూడా నిరూపించాలి. బలవంతమైన వ్యతిరేకపక్షాల నన్నిటినీ అణచివేయ ప్రభుత్వం నిశ్చయించుకొన్న దను అపోహ ప్రజలలో ప్రబలితే ప్రజాస్వామ్య ఉద్యమం తీవ్రంగా దెబ్బ తింటుంది.

గడచిన రెండు సంవత్సరాలలోను కమ్యూనిస్టుల అలజడి దేశంలో బాగా విజృంభించింది. అప్పుడు నిబ్బరంగా ప్రవర్తించిన ప్రభుత్వం, కమ్యూనిస్టులపలుకుబడి సన్నగిల్లుతున్న యీనాడు కమ్యూనిస్టు పార్టీని నిషేధించవలసిన అగత్యం కనపడదు. ప్రభుత్వ చర్యవలన ప్రజల దృష్టిలో కమ్యూనిస్టుల విలువ పెరిగే అవకాశం కలుగుతుంది. రానున్న యెన్నికలలో కాంగ్రెస్ను ఓడిస్తారేమోనని భయపడి ప్రభుత్వం తమ పార్టీని నిషేధించినట్లు కమ్యూనిస్టులు ప్రచారం ప్రారంభించారుకూడాను. ఇంతకంటె ప్రభుత్వం దౌర్జన్య చర్యలు జరిపినవారిని శిక్షిస్తూ, వారి అక్రమాలను యెప్పటికప్పుడు ప్రజలకు నిరూపిస్తూ ఉంటే కమ్యూనిస్టుల పలుకుబడి తప్పక తగ్గిపోతుంది. అన్నిటికంటె ముఖ్యంగా ప్రజల అశాంతిని, అజ్ఞానాన్ని తొలగించనిదే కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టటం సాధ్యంకాదని ప్రభుత్వం గ్రహించటం అవసరం.

# ప్రత్యేక ప్రకటన

సా. జోగిరాజు

ఎనౌన్సరు: ఇప్పుడు మే మొక ప్రత్యేకమైన ప్రకటన చేయవలసొచ్చింది:

**వాచకుడు :**

స్త్రీలారా, ఓ పురుషుల్లారా
యీ రోజుల్లో రేడియో వినే
పూతభారత సుపుత్రుల్లారా!
ముఖ్యంగా యిది మీ కోసం.
అపారపారంలో ఊహాల
కందని లోతుల్లో
ఊరదొక్కిన పురాణగాథల
గౌరవించక మనకీ రోజులు
దారవు పోయిన.
శ్రోతల్లారా!
భజనలు జేసే ధీమంతులపార్టీ
పరమార్థం బోధిస్తుం దిప్పుడు
వినండి తప్పని సరిగా
కనండి సద్గురుమూర్తిని
ఇదిగో భజనలపార్టీ.

**భజనపార్టీ :**

ఓం, ఖద్దరు, అహింస, హిందీ
ఓం, ఖద్దరు, అహింస, హిందీ.
మన ప్రభుత్వంలాంటిది భువిలో
కనీ వినీ ఎరగం ఎన్నడు.
ధర్మం నాలుగుపాదాల్లోనూ
దేశాన్నే నడిపించేస్తూ
అందరి రక్షణ తనదే నంటూ
అపారభారం పైన వేసికొని
నిందలనంటిని దిగమింగేస్తూ
ప్రజలను బిడ్డలగా పరికిస్తూ
అర్థంలేని పసిబిడ్డల
ఆకలిగొంతులు వింటూ
ఆడుకోను బొమ్మలిచ్చి (ఆహా ఎంత దయ)
జోలపాట పాడే మన
ప్రభుత్వములాంటిది భువిలో
కనీ ఎరగం ఎన్నడు.
ఎంతో జాగ్రత్తగా
మఱ్ఱిచెట్టు నీడలా
మనల నే క్షణానా మరువక
ఖద్దరు. అహింస, హిందీ
కావాల్సినంత సప్లయి చేస్తూ
ఆకలి దయ్యం మనలను
సోకకుండ కాపాడే
మన ప్రభుత్వంలాంటిది భువిలో
కనీ వినీ ఎరగం ఎన్నడు.
రక్తశేకు జెండా నొక్కటి
పక్షానికి గుచ్చుకుంటే
ఎందుకు మన కిక భయం లేదుగా
కనులను మూయగవచ్చు హాయిగా.

ఖద్దరు, అహింస, హిందీ
ఖద్దరు, అహింస, హిందీ
ఏడువాకట్లా ఏడూడూడూడూడూడూ.

**వాచకుడు :**

ఇంతవరకూ మీరు విన్నదాన్లో
సుంతైనా అబద్ధం లేదంటానికి
ఎంతైనా సాహసిస్తున్నాను.
కనిపించే యువక తెరల
వెన కన్నీ మేడిపళ్లే!
కనిపెంచే అమ్మాయిల
గాథల నెందుకు త్రవ్వటం?

**ఒక ప్రత్యేక కంఠం :**

వార్తలు వార్తలు వార్తలు
రష్యాలో యిపు డిప్పుడే
రాతి యుగం ఆరంభం
అమెరికాలో అడవులన్నీ
అందరికీ పంచేరట
చైనావాళ్లు బుర్రల్లో
బ్రైన్లున్నది పట్టిదేవట
ఇన్గ్లాండంతటికీ సేదు

ఇంగువ కరు వొచ్చిందట
పారిస్‌లో నాట్యకత్తె
పంటిబాధ నిజమేనట
దాగుడు మూతల్లో రావుకు
తల కొద్దిగా తిరిగిందట
పాకిస్తానుకు మనకూ
రైలుదారి మూస్తారట
(క్షమించాలి) మైలురాళ్లు వేస్తారట
నాగరిక దేశాలన్నీ
మన నాయకత్వాన్ని కోరాయట
ఏమీ వొకట్లా యేమీ.

వాచకుడు :

మీ రెప్పుడూ రేడియో వింటూంటే
ఎన్నెన్నో తెలిసికోవచ్చు మీగదిలోనుండే
కాని మీరు బ్రతికి ఉన్నప్పుడుమాత్రం రేడి
యోకున్న పరిసరాలక్కూడా రాకండేం.
చచ్చిపోయినవాళ్ళే రేడియోను చాలా
సావకాశంగా వినగలుగుతారు.
ఎవరు చచ్చారో
ఎవరు పుట్టారో
ఎవరు ఏడ్చారో
ఎవరు నవ్వారో
అదంతా మన కనవసరం
ఇందూ దేశం తాతా బిర్లా
యినప్పెట్టె భద్రం భద్రం

ఇంకో గొంతు :

హాస్యనటుడు శివరావా నా
ట్యకర్తెను పెళ్లాడాడా?
రాజాజీ దున్నిన నాగలి
క్రుశు గన్న పేటిక తగలటం నిజమే?
కాశ్మీరు లోయలోని సేనలు గాన
సభలకో తృప్తిపడ్డాయా?
1960 నాటికైనా అమిరో
ఫారిన్ మినిష్టరై పోగలడా?
రోగాలను కరువులు రావని
సంగీతంలు నమ్ముతూన్నారా?
తుపాకులు పెద్దవి చేసికొన్నంత మాత్రంలో
ప్రభుత్వం నిద్దుర పోగలదా
జనమంతా ఏనాటికైనా నిజం
మాట్లాడతారా?

—మీరంతా తృప్తిగా చచ్చిపోగలరా!
అర్హతకు తగ్గ అదృష్టాన్ని
అందుకోకుండానే అస్తమించటం
ముందుగా తెలిస్తే ఎట్లా ఉంటుంది!
—మర్చిపోయిన రిక్షావాలాకు
మనిషి మెదడు కదిలితే ఎట్లా ఉంటుంది
ఎట్లా ఉంటుంది భగవాన్?
బాగుపడ్డ అయ్య యినప్పెట్టెకింద
పాతింబిన శవాలెన్నో మన కెందుకు?

నీకూ పద్యాలు రాయాలనే దురదుంది పాపం
అయిదుబర్లూ రాసేసి
'అందులో కావాల్సినంతుంది పిండుకో' మను.

నీకూ నాలాగే
రేడియోలో మాట్లాడ బుద్ధయితే
పరివేష్టించిన గ్రహాలకు
ఆత్మాభిమానం (= 'అర్థంలేని గాలి' కద
టండీ అది)

నైవేద్య మిస్తే
అరగంటసేపు నీదే రేడియో
ఏడెనిమిది స్టేషన్లను మిస్సౌతూ
యింతసేపట్నించీ రేడియో వినేవాళ్ళందరూ
యింకా ఎందుకు బ్రతికున్నారో!

ఎవరు చచ్చారో
ఎవరెవరు బ్రతికున్నారో
ఎవ రెందుకు చచ్చారో
తెలుసుకోటానికి తీరికలేదు నాకు.

'ఎవడు' ఎవడో ఎవణ్ణిచంపిన 'వాడెవడో'
వాడెవడో ఎవణ్ణి ఎందుకు చంపేడో
ఏ నాటికైనా తెలుస్తుందా భగవాన్?

ఎవణ్ణో వాడెవడో చంపేడన్నా
వాడెవడో వాడెవణ్ణో చంపేడన్నా
మన కేంటో ఆశ్చర్యం
ఎట్లాగైనా చచ్చిపోయే వీళ్ళని
ఎందుకట్లా చంపటం?

ఇట్లాంటిది విన్నతరువాత కాకుండా
సహజంగా చావొచ్చినందువల్ల చావటం
ఏనాటికైనా జరుగుతుందా భగవాన్!

(సారోయన్ చదివింతర్వాత)

# మదరాసు ఎవరిది?

సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రస్తుతంలో ఏదైనా ప్రతిబంధకం ఉన్నదీ అంటే అది చెన్నపట్టణం ఎవరిదీ అనే అంశంపై ఆంధ్రులకీ తమిళులకీ ఉన్న అభిప్రాయభేదమే. ఈ అభిప్రాయభేదాన్ని పరిష్కరించుకోలేకపోతే అది అవకాశాన్ని ఉపయోగించుకోవటం చేతగాని తెలుగువాళ్ల తెలివితక్కువతనమే ఔతుంది.

చెన్నపట్టణాన్ని గురించి పలువిధాలుగా ఉన్నది ఆంధ్రుల వాదన—

ఒకటి–నగరం పూర్తిగా ఆంధ్రరాష్ట్రంలో చేరాలి.

రెండు–కూవంనది వద్దను విభజించి తెలుగులకూ తమిళులకూ చెరిసగం పంచాలి.

మూడు–ప్రత్యేకరాష్ట్రం చెయ్యాలి.

నాలుగు–తెలుగు, తమిళ రాష్ట్రాల ఉమ్మడి పాలనలో ఉండాలి.

మొదటిది–చారిత్రికంగా చెన్నపట్టణం తెలుగువారిది కనుక అది మాకే రావాలి అనటం న్యాయమైతే వెనుక ఆంధ్రులు పాలించిన పాటలీపుత్రాన్నీ, తంజావూరునీకూడా మనం కోరటానికి సంశయించ నక్కరలేదు. కాగా ఒక ప్రదేశం ఏదేశంలో లేక రాష్ట్రంలో చేరాలీ అనేదానికి పాత దస్తావేజులే ప్రమాణం అనే బూజుపట్టిన సిద్ధాంతాన్ని వదలివేయడం శ్రేయస్కరం. ప్రస్తుతంలో ఇలాంటి తగాదాలకు ప్రస్తుతం ఆ ప్రాంతంలో ఉంటున్నవారి ఇష్టమే ప్రమాణం — జనవాక్య నిర్ధారణే అన్ని రకాల వాదాలకీ తీర్పు చెప్పాలి అనేది ప్రజాస్వామ్య సూత్రబద్ధమైన మార్గంగా సర్వజనాంగీకారం పొందుతూన్నది. జనవాక్య నిర్ధారణ జరిపితే చెన్నపట్నం తెలుగువారిదనే వాదనకు ఏ మాత్రం బలం లేదనే విషయం బుజువౌతుం దనటంలో సంశయం ఏమీ లేదు. తెలుగుల తెలివితక్కువవల్లనైతేనేం, తమిళుల తెలివితేటలవల్లనైతేనేం ఈ నాడు మదరాసులో మొత్తం జనాభాలో ఆంధ్రులు మూడోవంతుకూడా లేరు. తమిళులు దాదాపు సగంవరకు స్థానబలిమి సంపాదించారు. కనుకనే ఈ బలహీనతను గమనించి తెలుగువారు ఈ వాదాన్ని వదలుకొని తక్కిన మూడు విధాలలో దేనికైనా దిగజారడానికి అంగీకరించవలసివచ్చింది. ఆ మాత్రం దూరదృష్టి కూడా లేనివారు అంతా మాకే రావాలని ఇంకా అరుస్తూన్నారు.

రెండవది–నగరాన్ని రెండుగా చీల్చివేయవలెననే వాదము. పైకి చూడటానికి బాగానే ఉన్నట్లు కనిపిస్తుందిగాని ఇందులో చూడగా చూడగా చాలా కష్టనష్టాలున్నై. మంచిమీద జరిగిన పరిష్కారంవల్ల మంచిఫలితాలూ, తగాదామీద జరిగిన పరిష్కారంవల్ల తగాదాలే పెరుగుతవి. విత్తొకటి వేస్తే చెట్టొకటీ పండొకటీ వస్తాయా? అదీగాక ఒకే నగరమధ్యంలో సరిహద్దుగీత ఉన్నప్పుడు దానిని సంరక్షించటం ఉభయులకూ కష్టమే ఔతుంది. ఒక భాగంలో వృత్తివ్యాపారాలు చేసుకుంటూ ఇంకొకభాగంలో కాపురముండేవాళ్లు అనేకు లుంటారు. వాళ్లు రోజూ అనేక పర్యాయాలు సరిహద్దురేఖ దాటుతూ ఉంటారు. వాళ్ళనెవరూ నిరోధించలేరు. మరి ఈ తిరగటంలో ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి ఎక్కడెంత అక్రమంగా రవాణాలు చేస్తూ ఉంటాడో, దాన్ని ఏ పోలీసులూ ఆపలేరు. ఒక అర్థమూ నగరాన్ని రెండుగా చీల్చటమూ, ఒక సజీవ దేహాన్ని రెండుగా చీల్చటమూ సమాన బాధాకరమైనవే. బెర్లిన్ ప్రజలు ఇలానే బాధపడుతున్నారు. ఒక కేంద్రప్రభుత్వానికి లోబడి ఉండటం వల్ల మదరాసు బెర్లిన్‌తో సమం కాకపోయినా ఈ పంపిణీ ఉభయుల క్షేమానికీ, సుఖానికీ విఘాతకంగానే పరిణమించి తీరుతుంది.

చెన్నపట్నాన్ని కేంద్రప్రభుత్వ పాలనలోని ప్రత్యేక నగరంగా చేయమనేది మూడవవాదం. 'నాకు లేనిది నా పొరుగువాడికీ మాత్రం ఎందుకుండాలి' అని చూసే ఓర్వలేని మనస్తత్వమే ఈ వాదానికి జన్మస్థానం. ఇంగ్లీషువారు సెంటు జార్జి కోట కట్టినప్పుడు ఒక పల్లెగా ఉండిన చెన్నపట్టణం ఇప్పుడొక మహాపట్టణం కాగలిగిందంటే దానికి కారణం అది ఒక రాష్ట్రానికి ముఖ్యపట్టణం కావటం వల్లనే. ప్రభుత్వపు కచేరీలూ, చట్టనిర్మాణ సభలూ, హైకోర్టూ, యూనివర్సిటీ, హార్బరూ వగైరాలన్నీ అక్కడనే కేంద్రీకరించ బడటం వల్లనే మదరాసు ఇంతింతై పెరిగిపోయింది. రేపు అది కేంద్రపాలిత ప్రత్యేకరాష్ట్రమైననాడు తెలుగు, అరవ రాష్ట్రాలు రెండూ తమతమ ప్రభుత్వ కచేరీలను, చట్టనిర్మాణ సభలను, హైకోర్టులను, కళాశాలలను, ఆసుపత్రులను తమ తమ రాష్ట్రాల మధ్యకే చేర్చుకొంటవి. ఓడరేవులను కూడ తమ తమ ప్రాంతాల్లో పెంపొందించుకొంటవి. ఈ విధంగా నగరం పెరగటానికి హేతుభూతములైన పరిస్థితులన్నీ తొలగటంతో చెన్నపట్టణమూ ప్రాభవము తొలగిపోయి తన పూర్వస్థితికి దిగజారి ఊరుకుంటుంది. ఇది దేశానికే నష్టమే. నగర నిర్మాణానికి బాధ్యులైన వారందరికీ బాధను కలిగించేదే. ఒక గేదెను అన్నదమ్ము లిద్దరిలో ఎవరి వంతులో వేసుకొనవలెనో తేల్చుకొనలేక-ఇంత కాలమూ ఎంతో గోముగా పెంచుకొని వస్తూన్న దానిని అడవిలోకి తోలివేయడంలాగ ఉన్నది ఈ ప్రత్యేక రాష్ట్రవాదన. పట్టణంలో జనవాక్య నిర్ధారణ జరిపితే అది ప్రత్యేక రాష్ట్ర నిర్మాణానికే అనుకూలంగా ఉంటుందనటంలో అనుమానం లేదు. కాని దానిలోగల సాధకబాధకాలను వారికి బోధపరచి కొరవితో తల గోక్కొనటం వంటి ఈ నిర్ణయానికి వారు లోబడకుండా చేయడం దూరదృష్టిగల వారి బాధ్యత.

ఇక ఉభయప్రభుత్వాల ఉమ్మడి పాలనలో ఉంచవలెననే వాదం కేవలం అర్థరహితమూ, ఆచరణాయోగ్యమున్నూ. చెన్నపగర వాసి అప్పుడు ఏ రాష్ట్రవాసి ఔతాడు? అతని ప్రతినిధి ఏ శాసనసభలో ఉంటాడు? అతడు ఏ ప్రభుత్వాజ్ఞలను పాలించాలి? ఉదాహరణకు, ఒక రాష్ట్రంవారు మద్యనిషేధాన్ని అమలు జరుపుతారు. మరొకరు జరపరు. అప్పుడు మద్రాసులో మద్యపానం నేరమా కాదా? పోనీ ఒక రేషన్ ప్రమాణం నిర్ణయిస్తే మద్రాసువాసి మూడుగిద్దలు తినవలెనా, నాలుగుగిద్దలు తినవలెనా. మూడున్నరగిద్దలు తినవలెనా? మనసులో పొరపులు ఏర్పడినతర్వాత ఉమ్మడి కాపురం ఉభయులకూ నష్టమే. ఉమ్మడి గేదెకు మేత ఒకరూ వేయరు- పాల కిద్దరూ తయారైనా. కనుక ఈ ద్వంద్వప్రభుత్వం కోరదగినది కాదు.

కాగా ఇక యీ సమస్యకు ఒకటే పరిష్కార మార్గ మున్నది. అదేమంటే తెలుగులు పట్టణంపై తమకుగల హక్కును నిశ్శేషంగా వదలుకొని దానిని పూర్తిగా తమిళులకు వదలటం-అందుకు ప్రతిఫలంగా కొంత నష్ట పరిహారాన్ని కోరటం. ఈ నష్ట పరిహార ద్రవ్యంతో మన భవిష్యద్రాజ్యధాని కాగలదానిని వృద్ధిచేసికో వచ్చును. పొరుగు రాష్ట్రంతో పొరపులు లేకుండానూ చేసికోవచ్చు.

పోతే చెన్నపట్నంలోని తెలుగువారి గతి ఏమికాను? అని ప్రశ్న వస్తుంది. అల్పసంఖ్యాక వర్గాల పేచీ అన్నిచోట్లా ఉన్నదే. మద్రాసు నొక్కనే ప్రొద్దు పొడవలేదు. దానికి హామీలు కోరటం, రక్షణలు పొందటం అనేది న్యాయమైన పద్ధతి. దానికై రాజ్యాంగ చట్టం ఉండనే ఉన్నది.

కేవలం వ్యర్థపు మొండి పట్టుదలతో త్రాడు తెగేవరకూ పురిపెట్టుకోవడమూ, అవకాశాలం జారవిడుచుకోవటమూ, దూరదృష్టి లేకపోవటం చేత అయ్యవార్లనుకుంటూ కోతిని చేయటమూ అనే పొరపాట్లను తమ నాయకులు పోనాడుకొనేటట్లు ఆంధ్రులంతా కృషి చేయాలి.

—చన్నాప్రగడ తిరుపతిరావు

2

ఆంధ్రులంతా జె. వి. పి. రిపోర్టు అంగీకరించి ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటు చేసుకోవటం ఉత్తమం అని కాంగ్రెసు వర్కింగు కమిటీ తీర్మానించిన సమయంలోనే, మద్రాసు

నగరాన్ని తమిళనాడులో చేర్చివేయవలసిందిగా మద్రాసు కార్పొరేషను తీర్మానించటం చూస్తుంటే, ఎక్కడో, ఏదో కుహకం జరుగుతున్నదనిపిస్తుంది. ఇక యీకుహకం అచ్చంగా ఆంధ్రులకే వ్యతిరేకుల మూలంగానే అయితే, అంతగా బాధపడవలసిన అగత్యం లేదు. కాని ఆంధ్రదేశపు నడిగడ్డమీద జన్మించి, తమ స్వార్థం కోసం ఆంధ్రరాష్ట్రంలో కొంత బలి చేస్తున్నా నాయకులుగా పరిగణింపబడే వాళ్ళని చూసి ఏమనుకోగలం! డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి వ్యవహారం చూస్తే, తను కాంగ్రెసు ప్రెసిడెంటు కావటానికి సహాయం చేసినందుకు తమిళులకే మద్రాసు నగరాన్ని వదిలేస్తానని వాగ్దానం చేసినట్టు ఆమధ్య ఎప్పుడో పుట్టిన నీలివార్త నిరాధారమైంది కాదేమోనని సందేహించవలసి వస్తుంది. దీని విషయమై నిజం తేలాలంటే, డాక్టరుగారు ఆంధ్రులకి అన్యాయం జరిగినందుకు (ఆయనకు అట్లా అనిపించదేమో, పాపం!) తన ప్రెసిడెంటు గిరీకి రాజీనామా ఇచ్చి మద్రాసు నగరం ఆంధ్రులదే అని చాటినప్పుడు, పై వార్తను గురించిన సత్యాలు కొంత బయట పడకపోవు. తాను అట్లా చెయ్యకపోగా మద్రాసు ఇప్పటికీ, ఎప్పటికీ ఆంధ్రులపరం గాబోదు కాబట్టి వెంటనే మా తీర్మానం అంగీకరించండి అని నిర్మొగమాటంగా, నిరభిమానంగా చాటిన స్థితి చూసినప్పుడు, తను ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పితామహుడైనట్టు చెప్పుకొన్నట్లే, ఆంధ్రరాష్ట్రానికి కూడా, పితగా చెప్పుకోవాలని చూస్తున్నట్టు అనుకోవాలిసి వస్తుంది. కాని డాక్టరుగారు పెద్దవారు; ప్రజలు చెప్పినవి అంగీకరిస్తారనుకోవటం వెర్రి. ఆంధ్రులంతా ఏకకంఠంతో మాకు మీరిచ్చే ఆంధ్రరాష్ట్రం అక్కర్లేదని చాటినా వినిపించుకోక, మీరంతా దీన్ని అంగీకరించండి అని వెంటాడటంలో, ఆయన ఏదో ఒక విధమైన వ్యవహారంలో చిక్కుకున్నారా అనిపిస్తుంది.

ఇదంతా నిజం కాకపోతే, డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు చిత్తశుద్ధి గల వ్యక్తి అయి ఉండీ కూడా నిస్సహాయులయ్యారని అనుకోక తప్పదు. జరిగితే ఒకటి జరిగి ఉండాలి. ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకంగా ఉన్న ప్రధాని, ఉప ప్రధానులను తనవేపు తిప్పుకోటానికి యత్నించి, కొంతమటుకు సఫలుడై, మద్రాసు నగరం వద్ద వచ్చే పేచీని చూసి, వాళ్లు మళ్లీ ఆంధ్రరాష్ట్రానికి విముఖులౌతారేమో ననే భయం వల్ల, ఆంధ్రరాష్ట్రం తొందరగా రావాలనే ఆకాంక్ష వల్ల యీయన యీ విధంగా వర్తిస్తూ ఉండాలి; ఇదే నిజమైతే, ఆంధ్రరాష్ట్రం కోసం పాలకుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడవలసిన దురవస్థ పట్టినందుకు సిగ్గుపడాలి. ప్రతి చిన్న విషయం దగ్గర్నుంచీ, దాక్షిణాత్యుల్ని అన్యాయం చెయ్యటానికి వెనుదీయని మన ఉత్తర హిందుస్థాననాయకుల్ని మనం ఎంత అమాయకంగా, భక్తిగా పూజించినా, మనందరికీ కావలసిన భాషారాష్ట్రాలుకూడ దక్కకుండా పోయింతర్వాత, మనం వాళ్ళని పూజించటమే కాదు—మళ్లీ మన చరిత్రలో ఇంకోమాటు దస్యులం కావలసివస్తాం. వాళ్ళధోరణి చూడాలి-తమాషాగా ఉంటుంది. ఈ మధ్య విజయవాడలో ఒక సభలో ఆచార్య వినోబాభావేగారు అన్న పలుకులు: "మీ భాషారాష్ట్రవాదం సమంజసమే, కాని దాని నిర్మాణానికి సత్యాగ్రహానికి పూనుకోవటం మంచిదిగాదు." అంటే, మనకు కావలసినవి దొరక్కుండా పోయినా, నోరుమూసుకొని కూర్చోమనా! ఆంధ్రరాష్ట్రపు నడిగడ్డమీద నిలిచి, 'మీ ఆంధ్రరాష్ట్రవాంఛ అసమంజసం' అనటానికి ఏ ఒక్కడికీ దమ్ముల్లేవు; కాకపోతే, 'మీ కోరిక సమంజసమే' అనేటప్పటికి ఉబ్బిపోయిన ఆంధ్రుల్ని, 'సత్యాగ్రహానికి పూనుకోకండి' అని నిరుత్సాహ పరచటం చేతవును, ప్రతివారికీ. ఆచార్య రంగాగారు కాంగ్రెసు వర్కింగు కమిటీ తీర్మానంమీద చేసిన ప్రకటన: "మీ స్వంత ఉద్దేశాలు వెల్లడించకండి. ఈ మధ్య ఏర్పడ్డ పరిస్థితుల దృష్ట్యా, దీన్నిగురించి మళ్ళీ తీర్మానించవలసి ఉంది." అంటే, దీని భావం బహిరంగం గాలేదూ? ఈ మధ్య యీ విషయంలో కొత్త వాతావరణం ఆంధ్రదేశంలో ఏర్పడిం దనుకోవటంలో అర్థంలేదు; ఎక్కడి పరిస్థితులకో జంకవలసిన అవసరం మన కెందుకో అర్థంగాదు.

మద్రాసు కార్పొరేషను తీర్మానాన్ని వ్యతిరేకించినవాళ్లు ఒక్క శ్రీ గుంటూరి నరసింహారావుగారే. ఇక ఆంధ్రుల్లో మద్రాసు కార్పొరేషను సభ్యులు తగినంతమంది లేరని అనుకోవాలా, లేక, ఉండీకూడా తీర్మానంపై చర్చలో పాల్గొనటానికి జంకారని అనుకోవాలా? (ఎందుకంటే, ఉన్న 12 సభ్యుల్లో 6 గురే పాల్గొన్నట్టు వార్త.) అయితే మద్రాసు కార్పొరేషను ఒకటి గుర్తించవలసి ఉంది. మద్రాసు మహాదేశం కాదు—మద్రాసులో ఉండేవాళ్ళ జీవితం ఇతరులమీద ఆధారపడ్డట్టే, రాష్ట్రంలో మిగతా చోట్ల ఉండే మనుష్యులజీవితం మద్రాసుతో కొంత మటుకు పెనవేసుకొని ఉంది. అందువల్ల ఒక్క మాటు అది తమిళనాడుకు పోవాలంటే సాధ్యం గాదు; మాచేవాళ్ళు ఊరుకోలేరు. అందువల్ల మద్రాసునగరం భవిష్యత్తు ఒక్క నగరవాసులే నిర్ణయించాలనడం అసమంజసం. కాని ఏ ఒక్క రాష్ట్రంలోను చేర్చతగ్గ పరిస్థితి కానప్పుడు చీఫ్ కమీషనర్సు ప్రావిన్సుగా ఉంచి, అందరికీ అందుబాటులో ఉంచవలసిన అగత్యం ఉంది. కాబట్టి మద్రాసు కార్పొరేషను తీర్మానానికి ఎవరూ ఏమంత విలువ ఇవ్వనక్కరలేదు.

ఇక ఆంధ్రులు చెయ్యవలసింది ఒకటే ఉంది: గత పర్యాయపు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ తీర్మానంమీద నిలబడటం. ఒకటి: ఆంధ్ర రాష్ట్రాన్ని వెంటనే ఏర్పాటు చెయ్యమని కోరుతూ, మద్రాసు నగరంమీద హక్కు వదిలివేసుకోవటంలేదని చాటాలి. ఇది కాకపోతే, రెండు: సత్యాగ్రహానికి పూనుకోవాలి. ఈ రెంటిలో ఏది చెయ్యటానికి వెనకాడినా, మనకి రాష్ట్రం రాకపోగా, మన స్థితి మరింత అధ్వానం అవుతుంది. మనం దేశాన్ని చూసి, అగ్రనాయకుల కష్టాల్ని చూసి తరువాత జాలి పడొచ్చు; ముందు మనల్ని చూసుకొని మనం జాలిపడాలి.

—"నడింపల్లి"

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## తెలుగు పత్రికల తీరుతెన్నులు

ఆంధ్రదేశంలో సుమారు కొన్నివందల పత్రికలు ప్రచురింపబడుతున్నాయి. సంతోషమే గాని అవి ఏయే ఆశయాలతో స్థాపించబడ్డాయో ఆయా ఆశయాల్ని విస్మరించి విజ్ఞాన రహితంగా ప్రచురింపబడుతున్నాయనడం అసత్యం గాదు. కొన్నికొన్ని పత్రికలు కేవలం ధనమే ప్రధానాశయంగా నడపబడుతున్న విషయం సత్య విదూరం కానేరదు.

కొన్ని పత్రికలు కేవలం బొమ్మలతోనూ, ప్రశ్నల శీర్షికతోనూ నింపబడుటయేకాని ఇతర వైజ్ఞానికవిషయాలుగాని, అభ్యుదయ వ్యాసాలుగాని కానరావడంలేదు. పైగా ఎవరైనా వాటిని విమర్శిస్తే, మేము చేస్తున్న సేవ అపారం, అమోఘం అంటూ డబ్బా వాయించుకోవడం మాత్రం జరుగుతోంది.

ఇక పిల్లల పత్రికల విషయం. వారికి కావలసినది కేవలం అభ్యుదయ రచనలూ, ఆదర్శ చరిత్రలేగదా! పిల్లల పత్రికల అట్టమీద "విజ్ఞాన పత్రిక" అని వుండటమేగాని లోపల నక్కలు మాట్లాడటం, కుక్కలు రాజ్యాలేలడం. దెయ్యాలతో కొట్లాటలూ, భూతాలతో పెనుగులాటలతో నిండిన కలా తోకా లేని కట్టుకథలేగాని వారికి ప్రధాన విషయాలు దొరకలేదా! దానివల్ల కలిగే విజ్ఞాన మెంతో విమర్శించి చూస్తే అదే తెలుస్తుంది.

ఇక సెక్సు పత్రికల విషయం. వాటి పరిణామం మరీ అధ్వాన మవుతోంది. సినిమా ప్రపంచంలో జానపద చిత్రాలపై ఏ విధమైన వ్యామోహం ప్రజలకు కలుగుతుందో అదే విధంగా ఈ సెక్సు పత్రికలపైకూడా వ్యామోహం విస్తరిస్తోంది. ఆ పత్రికలైనా మరీ కట్టలు తెంచుకొని గంగా ప్రవాహంలాగ మరీ అతిగా పోవడం అనర్థకంగానే తోస్తోంది.

ఏ పత్రికైనా చదివితే ఏదో ఒక రకమైన విజ్ఞానాన్ని చేకూర్చాలికాని అర్థ రహిత ప్రచారం చేయడం చాలా అన్యాయం. ఇప్పుడైనా ఏ రెండు మూడు పత్రికలో తమ ఆశయాలకు తగ్గ ఆచరణ చూపిస్తూ పునాది కట్టుబాట్లను వదలించకుండా పాటు పడుతున్నాయి గనుకనే తెలుగు పత్రికల గౌరవం కొంతయినా నిలువగల్గింది.

ఇక భవిష్యత్తులోనైనా తెలుగుపత్రికలు అర్థ రహితంగా కాగితాలను వ్యర్థపరచడంకన్నా, అభ్యుదయాన్ని అందించే విజ్ఞానాన్ని వెదజల్లే సాంఘిక రాజకీయ వైజ్ఞానిక విషయాలను ప్రచురిస్తూ అందరి సమస్యల్ని విచక్షణతో చర్చిస్తూ ఆపత్రిక లేయే ఆశయాలతో నిర్మింపబడ్డాయో సింహావలోకనం చేసుకొంటూ పురోగమించే సుదినం వస్తుందా?

ద్విభాషి వెంకటరాయశాస్త్రి
నరసరావుపేట